


# ప్రమాణ మెద్ది?

**(BY WHAT AUTHORITY?)**



## స్వామి కృష్ణాజీ

అనువాదకుఁడు

గుంటూరు వెంకట సుబ్బారావు

వసంత ఇన్‌స్టిట్యూట్ వారిచే ప్రచురితము

1928

# పీఠిక

ఈ గ్రంథమునందలి చిన్న యుపన్యాసములు 1927 సంవత్సరమున, హాలెండు దేశమున, ఆమ్మెన్ గ్రామమున "ఎర్డె" భవనమున "తారక శిబిరము" అను పేరుతో జరిగిన తారక సంఘ సమావేశమున శ్రీ కృష్ణాజీగారిచే నొసంగబడినవి. ఆ సమావేశమునకు వేలకొలది మంది తారక సోదరులు వచ్చియుండిరి.

ఆ శిబిరమున ప్రత్యహము సాయంసంధ్యా సమయమున శ్రీ కృష్ణాజీగారు, అగ్నిదేవతాకములగు వేద మంత్రములను పఠించుచు, అగ్నిని ప్రజ్వలింపఁజేసి, యా యగ్నిజ్వాలచుట్టు సమావేశమై యుండిన తారక సోదరులకు ఉపన్యసించుచుండిరి. ఆ యుపన్యాసము లారును ఆంగ్లమున ప్రచురింపఁబడినవి. అనేక భాషలలోనికి భాషాంతరీకరణము చేయబడినవి. ఆంధ్రమహాజనుల కుపయోగకరముగ నుండునట్లు తారకగ్రంథ ప్రచురణాధికారుల యనుమతితో వానిం దెనిఁగించి, దివ్యజ్ఞానదీపికయందు మొదటఁ బ్రచురించి, యిపుడు గ్రంథరూపమున ప్రచురించుచు, ఆంధ్రపాఠక మహాశయులకు నివేదించుచున్నాము.

శ్రీ కృష్ణాజీగారి యుపన్యాసములను ప్రత్యక్షముగ వినిన వారలకును, వానిని ఆంగ్లగ్రంథమున శ్రద్ధతోఁ బఠించిన వారికిని, గలిగిన యానందము, ఆధ్యాత్మిక ప్రబోధములలో కొంతయైనను ఈ చిన్న పుస్తకమును బఠించు ఆంధ్రసోదరులకుం గలుగు గాక యను తీవ్ర ఆశయముతో నీ చిన్న పుస్తకమును శ్రీ గురు మహారాజు పాదముల కడ నర్పించుచున్నారము.

అనువాదకుడు శ్రీయుత గుంటూరు వెంకట సుబ్బారావుగారు, యలమంచిలి.

(సంపాదకుఁడు)

చిట్టమూరు రామయ్య

---

# ప్రమాణ మెద్ది?

## I

నే నిచట ప్రతిసాయంత్రమును జెప్పబోవు నుపన్యాసములలో మీకు మార్గమును గనపరచి, మీయందలి గొప్పతనమునకును, ఔదార్య మునకును మూల మెద్దియో, యా స్థానమును మీరు స్వయముగా కనిపెట్టుటకు, మోక్షమును, ఆనందమును బొందుటకు మీకు గలిగిన యాకాంక్ష, కోరిక యెచ్చట ప్రారంభమైనదో దానిని మీరు స్వయ ముగా కనిపెట్టుటకు, తగినంతబలమును మీకు కలిగించుటకు ప్రయత్నిం తును. అయితే, అట్లు జేయుటకుముందు, మోక్షము, ఆనందము అనిన నా యభిప్రాయ మేమో మీకు బోధపరచుటకుముందు, మీ యభి ప్రాయములను పూర్తిగా వెనుకకుబెట్టి, నా తలంపులతోను, భావ ములతోను, ఏకీభవింపుడని కోరుచున్నాను. అట్లు చేసినయెడల నా యభిప్రాయ ప్రకారము మోక్షమనగా నేమో ఆనందమనగా నేమో మీకు తెలియును. మీ కాలోచనజేయుట సులభమై, మీరు మీ యంతరంగములలో లోతుగా దిగి జూడగలుగుటకై, మీ కొక కథను జెప్పుచున్నాను.

పూర్వ మొకప్పుడు, చాల గొప్పదియైన జ్వాల యొకటి యుం డెను. అది అత్యున్నతమై, ఆకాశము నంటుచుండెను. ఆ జ్వాలనుండి యనేకములు మిణుగురులు బయలుదేరెను. వానిలో నొక మిణుగురు నుండి యొక మానవుడు పుట్టెను. ఆ మానవుని, ప్రస్తుతము, కృష్ణ

మూర్తి యని పిలుతెము. నే నా కృష్ణమూర్తినిగురించి బాగుగా నెరుగుదును, గనుక ఈ కథ నెత్తుకొంటిని. ఆతనిగూర్చి నేను అభిమాన రహితముగ నిచట విమర్శింప పోవుచున్నాను, గనుక, మీరుగూడ నట్లే జేయుడని కోరుచున్నాను. మరియును, నేను కృష్ణమూర్తిని గురించి యెట్లు అభిమానము లేక విమర్శింప బోవుచున్నానో, మీరు గూడ మిమ్మల నంత అభిమానరహితముగా విమర్శించుకొనగలిగి యుండుటకై, మీ వ్యక్తిభావములను పూర్తిగా విడిచిపెట్టుడని కథ ప్రారంభించకముందే హెచ్చరించుచున్నాను.

ఆ మిణుగురు, అనేక యుగములలో, అంతములేని కాలపరిణామమున, మానవుడాయెను. మొట్ట మొదట, ఆ మానవు డనాగరిక స్వరూపుడై యుండెను. అనాగరికు లందరివలెనే యాతడును స్థూలశరీర వాంఛలను దీర్చుకొనుట యొక్కటియే కోరికగలిగియుండె. ఈ స్థూల శరీరవాంఛలకు, సుఖములకు ఆతడు లోబడిపోయెను. అతని కీ జీవితము యొక్క యునికి, యుద్దేశము, పర్యవసానము, అన్నియు నీ స్థూల శరీరసంబంధములైన కోరికలను తీర్చుకొనుటయే యైయుండెను. అనేక జన్మములలో నాతడు కొంత తెలిసికొనెను; కష్టములనుపడెను; వస్తువులను సంగ్రహించుట, సంగ్రహించినవానిని కాపాడుకొనుటయు, నేర్చుకొనెను; ప్రతివస్తువును తనకొరకై సంపాదించుట నేర్చుకొనెను. అస్థిరములగు అనేక వస్తువులను సంపాదించినగాని, అనేక వస్తువులను దాచుకొనినగాని యాతనికి సంతుష్టి కలుగలేదు. ఆత డజ్ఞానమనెడి శీతకాలమందుండెను; పరిపాకమున బాల్యదశలోనున్నంతకాలమును, తన శరీరవాంఛలను దీర్చుకొనుట, శరీరసుఖముల ననుభవించుట, యనున దొక్కటియే వాని జీవితోద్దేశమై యుండెను. కాని కాలముగడచిన కొలదియు, కష్టముల ననుభవించుటద్వారా, కులధర్మములను, అందరి క్షేమముకొరకును ఏర్పడిన ధర్మములను, తెలిసికొని, ఆ ధర్మముల

ననుసరించి, సత్యమును శాశ్వతమునైన దేదో వివేచనచేయ నారం
భించెను. మొట్టమొదట ఆ ధర్మముల నుల్లంఘించి, దుఃఖము పాలగు
టతో ప్రారంభించెను. తరువాత, ననేక జన్మములలో, నట్టిదుఃఖముల
వల్ల ననుభవములను సంపాదించి, తుదకు నాగరికుడాయెను. అనేక
యుగములలో, కాలముగడిచిన కొలదియు, సంవత్సరములకొలది దుఃఖ
ముల ననుభవించుచువచ్చి, మానవకోటియొక్క సుఖమునకు క్షేమ
మునకు అత్యావశ్యకములని లోకు లనుకొనువాటి నన్నిటినుండియును
తప్పించుకొన గోరి, జ్ఞానమునకై యన్వేషించెను. ఎందువలన ననగా,
ఆతడు "నే నెక్కడకు బోయినను, ఎక్కడవసించినను, దుఃఖమే
కనబడుచున్నది; నా వెలుపలను, లోపలను అల్లకల్లోలముగానున్నది;
దానినుండి తప్పించుకొనుటకు, ఈ బంధములనుండి, ఈ దుఃఖముల
నుండి, తప్పించుకొనుటకు బయలుదేరి, శాశ్వతవస్తువును, స్థిరమైనవస్తు
వును కనుగొనుటకై సంచారముచేయవలెను" అని యాతడనుకొనెను.

తన సుఖమునకు, తన యనురాగమునకు, తన ప్రేమకు, తన యా
రాధనకు, నాతడితరులపై నాధారపడజొచ్చెను. ఆతడు శాశ్వతమైన
సత్యముకొరకు వెతుకుటలో, దేవాలయములలోను, కర్మకలాపముల
లోను, యజ్ఞవేదికల (అథవా పూజాపీఠముల) చెంతను, ఇంకను
పరిచ్ఛిన్నములును, బంధకరములునగు నితర విషయములలోను చిక్కు
కొనిపోయి, తన్నుదా నెరుగజాలకపోయెను. కాని, వానికి తృప్తి
కలుగలేదు, నిరంతరమును ఆ విషయములతో పోరాడుచునే యుం
డెను. పర్వతశిఖరమునకు గొనిపోవుమార్గమున కిరుప్రక్కల నున్న
ఆలయములలో నుండి బయటపడవలెనని, యాతడు కోరుచుండెను.
తాను పూజించు విగ్రహమున కాధారముగ నేమున్నదో, తనయెదుట
నుంచబడిన, అనేక జన్మములనుండి తాను పూజించుచున్న, యా
విగ్రహముయొక్క కండ్లకును, మనస్సునకును మూలము ఏ మున్నదో,

చూడవలెనను కోరిక యతనియందలి గాఢమాయెను. ఆ ప్రతిమ యొక్క కండ్లకును హృదయమునకును వెనుక నేమున్నదో తెలిసి కొనుట కాతడతివిస్తారములగు కష్టములను, గొప్ప ఆశాభంగములను, గాఢమైన యాకాంక్షలను అనుభవించెను. అనేక జన్మములలో నిష్ఠల నవలంబించి, దేహమును క్షోభ పెట్టి, ఉపవాసములతో మాడి, కొంచెము కొంచెముగ స్థూలదేహము నాతడు వశపరచుకొనెను; తనదేహమును వశపరచుకొనుచున్నప్పుడే, రాగములను మనస్సునుగూడ వశపరచుకొనుటకు సాధనచేయుచుండెను. మనస్సును, రాగములును పరస్పరము సహాయపడనియెడల, ఒకటితో నొకటి యేకీభవించనియెడల, పరస్పరము ఆనుగుణ్యము గలిగియుండనియెడల, విరసము గలుగును. సౌష్ఠవము ఉండదు.

ఒక జాలరి చేపలను బట్టుటకై సముద్రములోనికి బోవునట్లు, ఆతడు అనుభవములను ప్రోగుచేసికొనుటకై సంసారములోనికి దిగి, ఆ యనుభవములను ప్రోగుచేయునప్పుడు, తన వలలో తానే చిక్కుకొని, ఆ యనుభవము లన్నిటికిని సారమైన జ్వాలలో ప్రవేశించుటకై, స్వేచ్ఛను బొందుటకై, ఆ యనుభవము లనెడి వలలోనుండి తప్పించుకొనవలసి వచ్చెను. మొదట మిణుగురు రూపమున జ్వాలలోనుండి వేరై వచ్చి, యిప్పుడు కృష్ణమూర్తిగా మీ రెరుగు వ్యక్తి, గొప్పయనుభవముల ద్వారా కొంచెము కొంచెముగా తిరిగి యా జ్వాలతో నైక్యము నొందగలిగెను.

ఈ కథనెందుకు చెప్పితివనగా, సాధారణముగా నట్లొక వ్యక్తి ప్రత్యేకించి సంసారమున నడుగిడిన తరువాత, నేర్చుకొనవలసిన సంగతుల నన్నిటిని నేర్చుకొని, జీవిత మొసంగగల యుపదేశములనన్నిటిని గ్రహించి, మోక్షమును ఆనందమును గాంచుట సాధ్యమగుటకు ముందు అనేక యుగముల కాలము పట్టును. అయితే, ఇప్పుడిచ్చటను మీరంద

రును ప్రియతముని సమక్షమున నున్నారు. ఆయన మీతో నున్నప్పుడు కాలప్రమాణము నశించును. కనుక మీలో ప్రతివారికిని, ఇప్పుడే యా మోక్షముయొక్క, ఆనందముయొక్క దృష్టి సాధ్యమగును; అందరకును గమ్యస్థానమైన దానిని దెలియుటకై, మీ రన్ని విధములగు దుఃఖములను, కష్టములను, విచారములను, సంతోషములను అనుభవించ నక్కరలేదు. నది పుట్టగానే తన గమ్యస్థానము సముద్రమని యెరింగి, దానిలో బ్రవేశించుటకై, పూనికతో నెట్లు పనిచేయునో, అట్లే మీరును, సంసారములో బ్రవేశించినదిమొదలు, మానవకోటికంతకును గమ్యస్థానముగ నియమింపబడిన స్థానము నెరింగి యుండవలెను.

నేను మీపై నొక ప్రమాణమును బడవేయవలయుననిగాని, నేను చెప్పినదెల్ల మీరు శ్రద్ధగా నమ్మవలయుననిగాని, మీరొక ప్రత్యేక వ్యక్తికి భక్తిసలుపవలయు ననిగాని, యీ సంగతులు చెప్పుటలేదు. మీరు ప్రియతమునితో నేకమైనప్పుడు, జ్వాలలో జేరిపోయినప్పుడు, మీరటనుండి తిరిగి బయటకు జని, మీకు ప్రాప్తమైన ముక్తిని ఆనందమును ఇతరులకు గూడ నొసంగగలుగుదురనియు, ఆకలిగొన్న వారికి శాశ్వతమైన యానందమును ఇయ్యగలుగుదురనియును, దుఃఖమనెడి, చెరలో బంధితులై యున్న వారికి మోక్షదర్శనము నొసంగగలుగుదురనియు, మీ కీ సంగతులను జెప్పుచున్నాను. అయితే, మీరా మోక్షమును, ఆనందమును, ఇతరుల కొసంగగలరు, చూపగలరు, గాని, దానిని వారు పొందవలెననిన, నందుకు వారే ప్రయత్నించవలయును. ఎందువలన ననగా, చెట్టును నరికినట్లు ప్రమాణమును నరికివేయవచ్చును; భూమిలోనికి లోతుగా బాతి, స్థిరస్థాపితములైన వేళ్లులేనియెడల మీ చెట్టు చచ్చిపోయి, తిరిగి క్రొత్తచెట్టునుదెచ్చి పాతవలసివచ్చును. కాని వేళ్లు బాగుగా స్థిరపడినయెడల, చెట్టు తిరిగి చిగిర్చి, చిగుళ్లు, మొగ్గలు, ఎత్తి, నీడనిచ్చును. ఈ ముక్తిని గురించి, ఆనందమునుగురించి, చెప్పుచున్నపుడు, మీలో

నిప్పుడు మాట్లాడుచున్న వ్యక్తినిగురించి యోచింపక, మీ యంతరంగ మున లోతుగా ప్రవేశించి, ఆత్మపరీక్ష చేసికొనుడని మిమ్మందరను హెచ్చరించుచున్నాను. నేను ఆనందమును కనుగొంటిని గనుక, నా శాంతిని, ప్రసన్నతను కనుగొంటిని గనుక, నేను నా ప్రియతమునితో నేకమైతిని గనుక, మీరుగూడ నట్లు జేయుడని కోరుచున్నాను. అట్లు చేయనలయుననిన, అనగా, మీరును ప్రియతమునితో నేకము గా వలయుననిన, మీకు బలమైనట్టియు, నిర్మలమైనట్టియు, హృదయమును, స్వచ్ఛమును, శాంతమునైన మనస్సును ఉండవలెను.

సూర్యుడు అన్నివస్తువులపై, చిన్నపాదపైని మహావృక్షముపైని గూడ సమానముగా ప్రకాశించి, వాని పురోవృద్ధికి తోడ్పడునట్లు, ప్రియతముడు మీ చెంతనున్నప్పుడు, మీరు పరిణామమార్గమున నే యవస్థయందున్నను, మీరు పూర్తిగా నభివృద్ధి నొందుదురు.

ఒక జ్వాలనుండి మిణుగురువలె బయలుదేరి, క్రమముగా ననుభవము లను సంపాదించుకొని, తుదకు భిన్నాత్మభావము నశింప నా జ్వాలలో దిరిగి ప్రవేశించుటయె సంసారోద్దేశ్యమై యున్నది. ప్రియతమునితో నేకము గాగలవాడే సుఖవంతుడు; ఏలయన, వాడు దప్పి గొన్న వారికి, ప్రాణజలము నీయగలడు.

కనుక, మిత్రమా! ఆనందమును బొందుటకు నీ స్వప్రయత్నముపైనే యాధారపడుము. కాని యితరులపై నాధారపడరాదని మొట్టమొదట నుండియు నెరిగియుండుమని కోరుచున్నాను. నా ప్రియతమునితో నేకమగుట యొక్కటియే నా యాకాంక్ష, అదియే ఆదినుండియు నా జీవితోద్దేశ్యము, కనుకనే, నేను కృతార్థుడనైతిని. ఇప్పుడు, మీ ప్రియ తముడు మీ చెంతనున్నప్పుడు, మీకా ముక్తిదర్శనము లభించుట సాధ్యమైయున్నప్పుడు, ఆ దర్శనమును గ్రహించి దానిని మీ హృదయ ములలోను మనస్సులలోను స్థిరముగా నుంచుకొనుట సాధ్యమై యున్న

ప్పుడు, మిమ్మును ప్రియతమునినుండి వేరుచేయు నాటంకముల నన్నిటిని త్రోసి పుచ్చి, నాశనముచేసి, ఆయనతో నైక్యమగుడని కోరుచున్నాను. మీ భావములు చాలినంత బలముగను, గాఢముగను నున్నయెడల, మీకిది గొప్ప యవకాశము, మీరు కృతార్థులగుట కిది గొప్ప తరుణము.

ఆనందమును, ముక్తిని పొంది స్థిరముగా మీయందు వాని నుంచుకొని, యచటనుండి బైటకు బోయినపుడు మీరు మీ యనుభవజనితమైన ప్రమాణములో మాట్లాడుటకు తగిన బలమును, శక్తియును, మీయందే యున్నవని మీకు కనపరచుటయే నా యుద్దేశ్యము.

---

# II

నేటిసాయాహ్నమున నేను ఉద్యానములో దిరుగుచుంటిని. అచ్చట పుష్పములు పూర్తిగా వికసించియుండెను. ఒకవరుస ననేక విధములైన పుష్పములు పూచియుండెను. ప్రతిపుష్పము తన జన్మము యొక్క పూర్ణవికాసమును, సాఫల్యమును పొంది లోకమున మానవున కానందమొనగూర్చుటకై వికసించి, తన విధాయకధర్మమును నెరవేర్చుకొనెను. బాగుగ వికసించి, కమ్మనితావులను వెదజల్లి, సౌందర్యాభిలాషులగువారల కా సువాసలను బంచిపెట్టుట కాపుష్పము లొక వేసవియంతయు వేచియుండెను.

ఆ విధముగనే మానవుడు ప్రతిదేశములోను ప్రతిచోటను, తన జన్మసార్థకత్వముకొరకై యంతటను వెతుకుచున్నాడు. అతడాసార్థకతను రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వ్యవహారములద్వారా పొందుటకు, ఆనందముద్వారా తాను పురోవృద్ధి నొంది వికసించుటకు ప్రయత్నించుచున్నాడు. లోకమునందలి జనులు—ప్రాచ్యులు, పాశ్చాత్యులు, పచ్చరంగువారు, నలుపు, తెలుపు, ఎరుపురంగువారు,—అందరును గూడ ఆనందమునకైయే ప్రయత్నించుచున్నారు. లేశమాత్రమైనను దుఃఖములో కలియని యానందము, శాశ్వతము, నిత్యమునైన యానందము, సంపాదించిన యనుభవములన్నిటికిని పర్యవసానమైన యానందము అందరకును జన్మహక్కు, అందరకును గమ్యస్థానము. అట్టి శాశ్వతమును, నాశరహితమునగు ఆనంద మున్నది; కాని దానిని యశాశ్వతములగు దుఃఖపరంపరలద్వారానే పొందవలయును.

నీ వెక్కడకుపోయి జూచినను, అక్కడ మనుష్యులు నశ్వరములైన వస్తువులద్వారా ఆనందమును బొందుటకు ప్రయత్నించుచున్నారని గానవచ్చును. తూర్పునకైనను, పశ్చిమమునకైనను, అందరు నొకే విధముగ బాధపడుచున్నారు. అందరకును ఒక్కవిధమగు దుఃఖములే, ఒక్కవిధమగు కష్టములే, ఒక్కవిధమగు కోరికలే, ఒక్కవిధమగు యాతనలే. అందరును తమలోపలనే యున్న యా శాశ్వతానందము కొరకే వెతుకుచున్నారు. మానవుడు శాశ్వతమైన ఆ యానందము కొరకు, ముక్తిరూపమగు నా యానందముకొరకు, క్షుద్రవిషయములలో వెదకుచున్నాడు. వాని కాకలియైనప్పుడు కడుపునించుకొనుటకు ప్రయత్నించును. దుఃఖితుడైనప్పుడు తన్ను తామరచి పోవుటయే సుఖ మనుకొనును. ప్రపంచమును విడిచి, వనప్రాంతముల నేకాంతవాసముననున్న సన్న్యాసి యానందమునే గోరుచున్నాడు; నిర్మాణకుడు, లలితకళాకోవిదుడు, మేధాసంపన్నుడు,—అందరును, శాశ్వతమును, కాలమునకతీతమును, బలకరమును, కష్టములు దుఃఖములు సంభవించినప్పుడు భరించుటకుతగిన వీర్యము నొసంగునదియు, నగు నానందమునే గోరుచున్నారు. అయితే శాశ్వతమగు నానందమునకై వెతుకుటలో వా రశాశ్వతములయిన విషయములలో బడి దారితప్పిపోవుచున్నారు. నాశనమొందు ఆనందమువలన నేమి ప్రయోజనము?. మరుక్షణమున మాయమగు సౌఖ్యము నొక్కక్షణ మనుభవించినంత మాత్రమున నేమి యుపయోగము?. నీవు నిర్మించునది యొక్కక్షణ మాత్రము సౌఖ్యమిచ్చునదైనయెడల, నీ నిర్మాణము నశించినవెనుక నిక దానివలన నేమి లాభము?

మీ రెక్కడకు పోయినను, మీరెక్కడ సంచరించినను, అక్కడ నెల్ల శాంతముగను, నెమ్మదిగను నివసించి, ఆనందసామ్రాజ్యములో నేకమైయుండదగిన యొకనిలయముకొరకు వెదకులాడుటయే గనబడును.

ఆ యానందముకొరకు ప్రయత్నించుటకును, దానిని పొందుటకును, అనేకమార్గములున్నవి. కాని, యెవ్వ రే స్వభావముగలవారైనను, ఎవ్వ రేమాదిరివారైనను, అందరును చేరవలసిన గమ్యస్థాన మొక్కటియే. ఈ లోకమున నేవ్యాపారము చేయువానికైనను ఆనందము, ముక్తియే గమ్యస్థానము. ఒక్కసారి నీ వా గమ్యస్థానమును తెలిసికొన్నయెడల, దానిని పొందుటకు అనిత్యములగు వస్తువులను, దుఃఖలేశ మంటినంత మాత్రమున తొలగువస్తువులను, అన్నిటిని నీవు విడిచిపెట్టుదువు.

తనలోనున్న దని తా నెరింగిన యా సామ్రాజ్యముకొరకు వెతుకువాడు ఏ దేశమువాడైనను, ఒకపూవుపైనుండి యొకపూవుపై కెగురుచు, తేనెను కూడబెట్టు సీతాకోక చిలుకవంటివాడని తెలియవలెను. వానిదృష్టి యెల్లప్పుడును బహిర్గతమై, బాహ్యప్రపంచమునందే ఆ యానందమును, ఆ సౌందర్యమును, ఆ సుఖమును, ఆ ముక్తిని, కనుగొనవలెనని వాడు ప్రయత్నించుచున్నాడు. అట్లు వాడీ బాహ్య ప్రపంచమున భ్రమించుచు, వలలోఁజిక్కుకొనినట్లు అసత్ప్రపంచమున జిక్కుకొని, తత్కారణమున కర్మమును జేయ నారంభించును. వాడెట్టి విత్తులు నాటునో యట్టి పంటయే ఫలించును. వాడు చేయు పను లెట్టివైనను, వానికి అనుగుణములగు ఫలములే కలుగును. వాడందునుండి తప్పించుకొనజాలడు, కనుక వా డా యశాశ్వతవిషయ ప్రపంచములో దగుల్కొని, ఒకదుఃఖమునుండి యింకొక దుఃఖమునకు, గొప్పదుఃఖమునుండి యింకను గొప్పదుఃఖమునకును, కొద్ది సుఖమునుండి గొప్ప సుఖమునకును, తిరుగుచున్నాడు. దుఃఖమునందును, అనిత్యమగు సుఖమునందును, వాడు బద్ధుడై యున్నంతవరకు, నిత్యసుఖముగల యా సామ్రాజ్యమునకుఁ బోఁజాలడు.

చీకటులతోను నాశనముతోను గూడియున్న యీ వ్యక్త ప్రపంచమున ఆనందసామ్రాజ్యము ఉండదు; మీలో ప్రతివాని యంతరంగ

మందున్నది; కనుక మీరంతర్ముఖులై, మీ యంతరంగమందే యా సామ్రాజ్యముకొరకు చూడవలెను. పరిణామమునందు మీ రే యవస్థ యందున్నను, మీ కెట్టి దుఃఖములు కష్టములు గలిగియున్నను, ఆనంద సామ్రాజ్యము, మీలో ప్రతివాని యంతరంగమందును, పూవులో తావియున్నట్లు, పూవులో దైవత్వమడగియున్నట్లు, ఉన్నది. మీ యంతరంగమున నొక్కసారి మీరా సామ్రాజ్యమునుఁ గనుగొనిన యెడల, నిక మీరా సత్తునుండి వెడలి యసత్తునకు (స్వేచ్ఛగా) బోవుచుండగలరు.

మానవకోటి కంతకును గమ్యస్థానము ముక్తి, ఆనందము, అని మీకు స్పష్టమగుటకు, మీ కొక యుదాహరణమును జూపుచున్నాను. అస్తంగతుడగు సూర్యుని తుదికిరణములు ప్రసరించుచున్నట్టియు, అంతమగుచున్న పగటి శోభతో నిండియున్నట్టియు, నొక పర్వతాగ్రము నూహించుకొనుడు. ఆ పర్వతముపై ననేక యంతరువులును, అనేక చలువ పందిళ్లు నున్నవి. ఆ పందిళ్లలో ప్రతిపందిలియును, తన క్రింద జేరి యందున్న దేవతను బూజింపుమని నిన్నాహ్వానించుచున్నది. ఆ యాహ్వానమునుగొని, మానవుడు తన గమ్యస్థాన మింకొకటి యున్నదని యెరిగియు, నా పందిట్లో ప్రవేశించి, యచ్చట కాలమంతయు సంతోషముతో వ్యర్థపుచ్చుచు నిలచి, తనను సంసారమున బంధించు కర్మమును ప్రోగుచేసికొనుచున్నాడు. వాడు పర్వతాగ్రమును జేరుటకు తగినంతబలమును, ఇచ్ఛాశక్తియును లేనివాడైనయెడల, ప్రతియంతరువు నతిక్రమించుచు, ప్రతిపందిటిలో విశ్రాంతి గైకొనుచుండవలెను. ఆ యిచ్ఛ, ఆ మనోనిశ్చయము, ఆ కార్యదీక్ష, సంపాదించుటకు వాడంతర్ముఖుడై యందున్న సద్వస్తువును దెలిసికొనవలెను.

మీలో ననేకు లొక ప్రతిమను బూజింతురు. ఆ ప్రతిమకు జీవము వచ్చినయెడల, దానికి జీవమురాకుండిన బాగుండు ననుకొందురు. ఏల

యన, నశించుదానిని, తుత్తునియలుగ చింపబడగల పటమును పూజింప వద్దనియును, అంతర్ముఖు లగుడనియును అది యపుడు మిమ్ములను కోరును. అంతర్ముఖులై, సత్యసామ్రాజ్యమును, సత్సామ్రాజ్యమును, ఆనందసామ్రాజ్యమును, మోక్షసామ్రాజ్యమును, అక్కడనే జూడుడని యా ప్రతిమ మిమ్ములను కోరినయెడల, మీ కది కష్టముగ దోచును; ఏలయన, దానికొరకు ఆలోచన చేయవలెను; దానికొరకు శిక్షనొంద వలెను, ఆత్మపరీక్ష చేసికొనవలెను; ఆత్మ విమర్శనము జేసికొనవలెను. ఇవన్నియును జేయుట కొప్పుకొనువారు మీలో బహు కొద్దిమంది మాత్రమున్నారు. మిమ్ముల నా పర్వతాగ్రమునకు గొనిపోవుట కొక యింద్రజాలము కావలె నందురు. ఉఱుము లుఱుముచు, మెఱుములు మెఱయుచునుండ, నా మధ్య నెవడో యొక దివ్యపురుషుడు దటాలున ప్రత్యక్షమై, యేదోయొక మందు నిచ్చి మిమ్ములను తన యద్భుత మహిమవలన, పరిశుద్ధపరచి, పర్వతాగ్రమున కొక గంతువేయుటకు తగినంతబలము నీయవలెనని యెదురుచూచుచున్నారు.

కాని, మిత్రమా, సత్యము నీలోనే యున్నది. ఆ సత్యమును నేను కనుగొంటిని, దానితో తాదాత్మ్యము నొందితిని, నా హృదయమున నేనును నా ప్రియతముడును ఒక్కటిరై యున్నాము, గనుక, నీవును నీ హృదయమునందు, మనస్సునందును ప్రవేశించి, యచటి శాంతమును, నెమ్మదిని కనుగొనుటకై, కవాటబంధముల నెట్లు దెఱవవలయునో జెప్పుచున్నాను. కాని, దుఃఖమనగా నేమో, కష్టపడుట యనగా నేమో, యిక్కట్లుపడుట యనగా నేమో, అశాశ్వత సుఖములేవో, శాశ్వతసుఖము లేవో, నీ వెరిగియుండవలెను. అనుభవమువలన జ్ఞానమును, నిర్మలహృదయమునుండి యెఱుకయును గలుగును. అనుభవము లేకున్నను, హృదయ మెరుంగుట కిష్టపడకున్నను, నీ వా కొండ మీదికి బోవుమార్గమునకు ప్రక్కలనున్న పందిళ్లలో చిరకాలము

నిలిచియుందువు. నీలో ప్రియతము డుండుటచేత, ఆ పందిళ్లన్నిటిని విడిచి, నీవే యా ప్రియతముడవు కాగలవు.

ప్రస్తుతకాల మహాత్మ్య మదియే. అట్టి యెండకాలపు దినములు, మీరు (అనుభవములనెడు) ఫలసాయమును కూడబెట్టుకొనగల దినములు, మీ యిండ్లను సిద్ధపరచుకొని, సకలవస్తువులను సర్దుకొని, అతిథిని సత్కరించుటకు సిద్ధముగ నుండగల దినములు, బహు కొద్దిమాత్ర మున్నవి. నీవే ఆ యతిథి వని,—నీవే మహనీయుడవై, మహాత్మ్య యుతుడవై, పరిపూర్ణుడవై అతిథివైతినని—నీకు తెలియును. ఒక్క సారి నీ వాయనను నీ హృదయాంతరాళమున గనుగొని, నీ మనస్సులో స్థిరముగ స్థాపించుకొని యున్నయెడల, నిత్యమగు నానందసామ్రాజ్య మును, హద్దులులేని మోక్షమును ప్రవేశించిన వాడవే.

కనుక, ఆనందము, మోక్షము కానలయువా రంతరంగమున జొచ్చి విహరించి, వెతికి, తమ సామ్రాజ్యమును తామే కనుగొనవలెను. వారా నిలయమును గాంచినంతనే, యంసరకును అదియే సామ్రాజ్యమని కను గొందురు—ఏలయన, అందరును వెతుకుచున్నారు, అందరును కష్టముల నొందుచున్నారు, అందరును దుఃఖభరితు లగుచున్నారు. ఆ నది మూలమునందలి నీరు త్రాగినవారు, అనుభవజనితమగు జ్ఞానమును వృద్ధి జేసికొన్నవారు బైటికేగి, కష్టములవలన బాధపడుచున్నవారికి ముక్తి స్వరూపమగు నా శాశ్వతానందము నొసంగగలరు.

---

## III

ఈ సాయంత్రము నే జెప్పబోవుమాటలను మీరు శ్రద్ధతో విని, వానియొక్క యర్థమును పూర్తిగా గ్రహించి, దానివలన మీ మనస్సునందును, హృదయమునందును గూడ యవధారణ గలుగవలయునని గోరుచున్నాను. నేడు సాధ్యమయిన యెడల, మిమ్ములను నా మనస్సులోనికి, నా హృదయములోనికి గొనిపోయి, నా స్వప్నము లెట్లు సిద్ధి నొందినవో, నెమ్మదిని, శాంతిని—ఆనందమును ముక్తిని ఒసంగు శాంతిని—నే నెట్లు గాంచితినో, నా ప్రియతముని జూచి, ఆయనను నావానిగా జేసికొను భాగ్యము నాకెట్లు లభించినదో, మీకు దెలియ జేయగోరుచున్నాను. మీరీ విషయమై పూర్తిగా గ్రహించుటకై, నన్ను ప్రమాణముగా గైకొనవలదని వేడుకొనుచున్నాను; ఏలయన, మీరు నన్ననుసరింతురేని, మిమ్ములను మీ హృదయములోనికి గొనిపోయి, యచ్చట మీరు నా ప్రియతమునిగూడి, సంశయలేశమైనను లేక నిశ్చయమగు శాంతిమార్గమున బ్రవేశించునట్లు జేతును. నేఁ జెప్పబోవునది మీరు పూర్తిగా గ్రహించుటకై, మీరు ఈక్షణమునకే గాక, బహుశః, మీ జీవితాంతమువరకును, సత్యమును సాక్షాత్కరించు కొనునట్లు షేయవలసియున్నది; సత్యమును గ్రహించినయెడల, మీ పూర్వాభిప్రాయములను, మరియు, సత్యభావమునకును, సత్యగ్రహణమునకును చుట్టును ఈ జన్మమున మీరు కట్టిన ఆవరణములను పడగొట్టగలరు. మిమ్ము అల్పదృష్టిగలవారుగను, సత్యముపట్ల విపరీత దృష్టిగలవారుగను జేసిన మీ సంకుచిత స్వభావమును, మీ బంధములను,

మీరు సంపాదించిన, మీ జీవితాంతర్భాగములను, వస్తువులను, అన్ని టిని పూర్తిగా నాశన మొనర్తురుగాక యని కోరుచున్నాను. నేను చెప్పబోవు విషయ మతి సుబోధక మైనది—సంకులమగు మనస్సు నకు బోధపడనంత సరళ మైనది. సంకుల హృదయమును, సంకులమనస్సు ను సత్యమును పట్టుకొని తలక్రిందు జేయును. నేను చెప్పు విషయ మితరులు నమ్మునట్లు చేయుటకుగాని, మీరైన నమ్ముటకుగాని ప్రమా ణముగా గైకొనరాదు.

స్పష్టపరచవలసిన కొన్ని విషయములను గురించి, బోధపరచుకొన వలసిన కొన్ని విషయములనుగురించి, యిచ్చట సమావేశమైనవా రనేకు లు కొంత బాధపడుచున్నట్లు నాకు తెలియును! అందుచేత, నిప్పుడు, కేవలము మాటలను గురించి పోట్లాడుట ప్రమాదకరమని మీ కెరిగించ వలెనని నాయుద్దేశము. గొప్ప సత్య మెప్పుడును సులభమును, సత్య మునై యుండును. అట్టి సులభమైన విషయమును గ్రహించుటకు, ఏదైన నొక మహిమను జూపవలయునని గోరువా రీ సమావేశములో, ఈ లోకములో గొందరున్నారు. నే నెవరని తలచుచున్నారో వారినని తాను నమ్ముటకు లేన నొక మహిమను జూపవలెనని నన్నొక రడిగిరి. మీరు సత్యము నెరింగి, గ్రహించుటకంటె నెక్కువ మహిమ యేమి యుండగలదు? ఒకరు మిమ్ములను మీమీ హృదయములోనికి, మీమీ మనస్సులోనికి దోడ్కొనిపోయి, యచ్చట సత్యమును దెలిసికొనుట యందు మీకు దోడ్పడుటకంటె గొప్పమహిమ యేమికావలెను? సముద్రమునకు శాంతముగా బ్రవహించుజలములను, ఆ సముద్రమునం దల్లకల్లోలముగ నాట్యమాడు జలములను, గ్రహించుటకుగాని, స్వచ్ఛ మును సుందరమునగు గులాబిపువ్వును గ్రహించుటకుగాని, నిర్మలాకాశ మును, ఆ యాకాశమున నొంటరిగ బరువిడు మేఘమును గ్రహించుటకు గాని యే మహిమ గావలెను? పరిశీలన చేయువానికి, అన్వేషించు

వానికి, కష్టపడువానికి, తన యాలోచనలను మార్చుకొనుటకు, తన చిత్తవృత్తిని మార్చుకొనుటకు, నిరూపణ మేమి కావలెను? అమానుష మగు నొక మహిమను జూచి మోహవిభ్రాంతుడగుటకంటె సత్యమును నమ్ముట కష్టము, సత్యమును అంగీకరించుట కష్టము. నే నిప్పుడొక మహిమను గనపరచగలిగిన యెడల మీరు నన్ను నమ్మెదురు; కాని నమ్మకము అశాశ్వతవస్తువులవలన గలుగదు; మహిమ లశాశ్వతములు గాని నిత్యములు గావు. సత్యమే అనంతము, శాశ్వతము. నేను మిమ్ము ను నా హృదయములోనికి గొనిపోయి, నాకుగల యెఱుకను మీకు గూడ గలుగజేయబోవుచున్నాను, గనుక సత్యము నెఱుంగుటకై, మీ సంకీర్ణతలను, మీ సిద్ధాంతములను, మీ తీర్మానములను, విడిచి పెట్టుడు.

ఈ జీవితము నెచ్చటినుండి చూచినచో సాధారణ మానవునికంటె భిన్నముగా జూచుట కనకాశమగునో, అనేకసలను వశముచేసికొన్న జీవితమున కెచ్చటనున్న వశముకామో, ఎచ్చటనున్నయెడల జీవితము నిజ సౌలభ్యములోను, నిజస్వచ్ఛందతతోను తెలియనగునో, ఆ యున్నత స్థానమును, బొందుట నాకు సంప్రాప్తమైనది. ఈ యానందమును, ఈ ముక్తిని పొందుట నాకు సంప్రాప్తమైనది. బంధ హేతువులగు నను రాగములనుండియు, సర్వదుఃఖములనుండియు, ఇక్కట్లనుండియు, కష్టములనుండియు, తొలగుటవలననే, విముక్తినొందుటవలననే, మనకు నిజముగా శాశ్వతానందము లభించును. ఆ యెఱుకను, దప్పిగొన్నవారి దప్పిదీర్పగల జీవామృతమును మీ కొసంగుటయే నా యుద్దేశము; ప్రజలు నన్నే పేరుతో బిలచినను నేను మీ కా యమృతము నొసంగుదు ను. మీ కొసంగవలయునను తీవ్రమగు నాకాంక్షవలననే, మిమ్ములను నా హృదయములోనికి గొనిపోయి, నాకుగల యెఱుకను మీ కొసంగు దును. ఇతరులను వారి కష్టములనుండి, వారి క్షుద్రతనుండి, వారి

యల్పత్వమునుండి, వారి పరిచ్ఛిన్నములనుండి, వారి స్థిరాభిప్రాయముల నుండి, విముక్తులజేయగల శాశ్వతానందము నితరుల కొసంగుటయందే సత్యమున్నది. నాయొద్ద నానందముయొక్క నిధియున్నది గనుక నే నితరుల కీయగలను. మాటలను గురించి మనము పోరాడవలదు, అభిప్రాయభేదముల నందవలదు. మీరు బాధపడుచున్నారు, నేను కనుగొనిన సత్యమును మీరు కనుగొనుట కాకాంక్షతోనున్నారు, మీరీ జననమరణ చక్రములో తగుల్కొని దాని బంధములనుండి తప్పించుకొన గోరుచున్నారు, గనుక, మీరా సత్యమును తెలిసికొనుటయే ముఖ్యమయినది. ఆ సత్యమును మీకొసంగువా రెవరైనదియు ముఖ్యము కాదు; మిమ్మును మీరు తెలిసికొనగల, ఆ యానందసామ్రాజ్యమును కనుగొనగల, పర్వతాగ్రమున కెక్కుటకు సహాయమొసంగు నెఱుక మీకు గలుగజేయువా రెవరైనదియు ముఖ్యముకాదు. మీరు కృష్ణమూర్తియొక్క దేహాత్మను పూజించినయెడల, దానియందు మీ కనురాగము కలిగినయెడల అనిత్యమైన యా దేహాత్మస్వరూపము నశించును గనుక మీరు బాధపడుదురు. అటుగాక మీరు సత్యము నుపాసింతురేని, ఆ సత్యములో జేరిపోవుదురు. మీరు సూర్యాస్తమయమును చూచినపుడా శోభ మీకు సత్ప్రవర్తన నియమములను, పద్ధతులను, శాస్త్రములను, సంప్రదాయమును ఈయదు. కాని మీరా శోభయందు జేరిపోయినయెడల, నిక నెన్నటికిని మీరు శాస్త్రములు, పద్ధతులు, జీవిత విధానములు, ప్రవర్తన నియమములు మొదలైనవానిని గురించి తొందరపడనక్కరలేదు. ఆ యెఱుక గలిగినయెడల, అనిత్యవిషయము లనెడి వలలో, నిరర్థకములగు సంకుల విషయము లనెడు వలలో దగుల్కొనరు.

నే నీ విషయములను జెప్పుటలో మీకు నేను ప్రమాణముగా నుండవలెనని నాయుద్దేశ్యముగాదు; మీయొక్క మాహాత్మ్యమును గురించియు, మీ బలమునుగురించియు మిమ్ములను నమ్మించుటకును, మీరు

కామ్యసిద్ధిని బొంది యితరుల కిచ్చుటకొరకు మీ కోరికలను పెంపొందించుటకును, చెప్పుచున్నాను. నేను వీరినైనను, వారినైనను, నే నెవరినని చెప్పుకొనుచున్నానో వారినే యైనను, కాకున్నను, అది యంత విశేషమైన సంగతికాదు. నే నేదియైనను, అది నాలోనే యుండును; నేను కాకున్నది నాయొద్దనుండి రాలిపోవును. నాకు ప్రాప్తించినది, నాయొద్దనున్నది, నాలో నొకభాగమైయున్నది, యెన్నటికిని పోజాలదు.

ఇది చక్కగా దెలిసికొని ప్రస్తుతాంశము విమర్శింతము. లోకమేమి కోరుచున్నది? సత్యమును తెలిసికొన్న పురుషులను కోరుచున్నది. సూత్రములలోను, మతసిద్ధాంతములలోను, జగడములలోను, పూర్తిగ మునిగి పోకుండనున్న పురుషులను కోరుచున్నది. నన్నుగురించి మీరేమి తలచుచున్నదియు, మిమ్మునుగురించి నేనేమి తలచుచున్నదియు లోకమున కక్కరలేదు. మీకుగల జ్ఞానమును పానముచేయుటకు లోకము కోరుచున్నది. ఇట్టి సమయములో మీరు క్షుద్రములగు భేదములలో మీ జ్ఞానమును దుర్వ్యయము చేయుదురేని, దుఃఖితులై కష్టపడుచున్న ప్రజలయొక్క, సత్యాన్వేషణపరులయొక్క అవసరములను లక్ష్యము చేయనివారగుదురు.

మీ వ్యర్థప్రలాపములనుండియు, మీ సిద్ధాంతములనుండియు, మీ తత్త్వములనుండియు, మిమ్ము విముక్తిచేయు ఎఱుక, మీయెదుట నొక యద్దమును బెట్టి, మీ నిజస్థితిని మీకుగనబరచి, ఆ దర్శనసహాయమున మీకు బలముగలిగి మార్గారోహణము జేయఁదోడ్పడు నెఱుక మీకు గలుగజేయవలెనను కోరిక నాకు తీవ్రముగా నున్నదని చెప్పియుంటిని. మిమ్మును మీరు కనుగొనుట, మిమ్మును మీరు తెలిసికొనుట, మీరు బలమును సంపాదించుకొనుట—ఇవియే ముఖ్యముగాని, మీ సూత్రములు, మీ సంప్రదాయములు, మీ సిద్ధాంతములు ముఖ్యములుగావు. మీ రందరును బాధపడుచుండుటచేత, మాటలచేతను, సుశ్రావ్యములును

మధురములునైన ధ్వనులచేతను మోహితులు కాఁగోరుచున్నారు కాని, వానివల్ల మీ దుఃఖకారణము నెంతమాత్రము నశింపజేయజాలరు. కొంతకాలము దానిని తప్పించుకొనిపోఁగలరు గాని, సూర్యోదయము వలె అది తప్పక తిరిగి ప్రత్యక్షమగును. దుఃఖమును నాశనము చేయుటకు, దుఃఖమును కలుగఁజేయుదానిని నిర్మూలముచేయుటకు, మీరంతర్ముఖులై, సత్యము, మోక్షము, ఆనందము, అను లోకము నచట గనుగొనవలెను.

వ్యక్తిసమస్యయే లోకసమస్య. వ్యక్తి శాంతినొంది ఆనందమును బడసి, గొప్ప సహనముగలిగి, తీవ్రమైన పరోపకారాపేక్ష గలిగియున్న యెడల, లోకసమస్య యనున దొకటి యుండనే యుండదు. మీ స్వంత సమస్యలేమో యెరుగక పూర్వమే లోకసమస్యలనుగురించి యాలోచింతురు. మీ హృదయములలోను, మీమనస్సులలోను, శాంతియు, నెఱుకయు, నెలకొల్పకొనక పూర్వమే యితరులమనస్సులలోను, జనాంగములలోను, రాష్ట్రములలోను, శాంతిని, నెమ్మదిని నెలకొల్ప బోవుచున్నారు. మీలో నెఱుకయు, నిశ్చయమును, బలమును గలిగి నప్పుడే మీకు నైటి శాంతియు, నెఱుకయు కలుగును.

జీవితమునొక్క యుద్దేశమేమి? మీరెందుకు బాధపడుచున్నారు? మీకు కష్టములెందుకు కలుగుచున్నవి? మీరెందు కేడువవలెను? మీరు నిగ్రహము నెందు కుపయోగించవలెను? మీరెందుకు ప్రయత్నించవలెను? ఇదియంతయు ప్రప్రథమమునుండియు, భూలోకము సృష్టింపబడినది మొదలు, ఈశ్వరునుండి వెలువడిన యంశ సంసారయాత్రకై బయలు దేరినదిమొదలు జరుగుచున్న పరిణామక్రమము. ఆ యీశ్వరాంశము పర్వతాగ్రమున కెక్కుచున్నప్పుడు త్రోవలో నిరుపయోగములగు వస్తువులను కూడబెట్టుకొని, దానివలన కర్మమును ప్రోగుచేసికొని, క్రమముగా పైకెక్కుకొలదియు దానిని కొంచెము కొంచెముగా

విడిచిపెట్టి, లేలికపడి, శుద్ధ కాజ్వాలను జేరి, యా సత్యమగును. మీరా జ్వాలనుండియే వెలువడివచ్చి, తిరిగి యా జ్వాలను జేరుటకే పోవుచు, ఆద్యంతముల నొక్కటిగ జేయుచున్నారు. ప్రత్యేకాంశగా బయలువెడలిన భిన్నాత్మభావమును విడిచిపెట్టుటయే జీవతోద్దేశము. ఆ భావము విడిచినపుడు మీలో సత్యము నెలకొని, మీరా సత్యములో నొకభాగమై, మీరే యా సత్య మగుదురు.

మీరిప్పటినుండి మీమీయిండ్లకేగినపుడు అక్కడివారు మిమ్మల నందరను ప్రశ్నల నడుగుదురు. మీ ముఖములలో తేజస్సును, మీ హృదయములలో ఆనందమును చూచి వారును వానిలో పాల్గొన గోరుదురు. వానిని వారి కేవిధముగ నిత్తురు? "ఫలానా బిరుదుతో బరగు ఫలానా వానిని మీరు నమ్ము" డని చెప్పుదురా? లేక, "ఫలానా వారు నా హృదయమును దెఱచి, నాకు జ్ఞానము నొసంగినారు గనుక, ఆ జ్ఞానమును మీకుకూడ నొసంగగోరుచున్నాను" అని చెప్పుదురా? మీ రప్పుడు చెప్పుదానిని బట్టి లోకము మిమ్ము విమర్శించును. మరియును దానివలననే మీరు లోకమునకు సహాయ మొనర్పగలరు. ప్రజలకు పేర్లును, బిరుదులును, చిహ్నములును, సంఘములును, సమాజములును, అక్కరలేదు. ఎఱుక, సానుభూతి, అనురాగముమాత్రము వారికి తృప్తిని గలుగచేయునుగాని, మీ సూత్రములు, మీ సిద్ధాంతములు, మీ బలవంతపు నమ్మకములు వారికి తృప్తిని గలుగజేయవు. వారికి దాహమును తీర్చు జలము కావలెను; వారితాపములను, ఆకాంక్షలను చల్లార్చి, వారిలో శాంతిని, నిశ్చయమును, తన్మూలమున నాత్మబలమును, గలుగజేయు జలము వారికి కావలెను. వారికొరకు మీరొక ప్రమాణమును గనపరకురేని—ఆ ప్రమాణ మెవరిదైననుసరే—వారిని మీరా ప్రమాణమునకు గట్టివేయుదురు. దానివల్ల వారు బాధితులైన, కొంతకాలమున కాప్రమాణ బంధములనుండి తప్పించుకొని పోగోరుదురు.

మీలో ప్రతివానియందును వసించియున్న యీ సత్యమును బైట బెట్టవలసియున్నది. సూర్యుడు అన్నిరకముల పుష్పములపై ఒకేరీతిగ ప్రకాశించునట్లు మీకందరకు ధైర్యము గలుగజేయుటకు తగినశక్తి నాయందున్నది. మీ కా కాంక్షయున్నయెడల, చాలినంత యెఱుకయు, సంకల్పమును ఉన్నయెడల, నిర్మలమగు సత్యమును, కేవలసత్యమును, దెలిసికొనగలరు. అట్లుగాక మీరు సంకులస్వభావులైనయెడల ఆ సత్యమును తలక్రిందుజేతురు. సముద్రముపార్శ్వముగా ప్రవహించు నది తనమార్గమున జనులకందరకును—వారు పింగళవర్ణమువారని, నల్లవారని, తెల్లవారని, పసిమివర్ణమువారని భేదములేకుండ—ఆహారము నొసంగును. తన తీరములయందు దాహముగొనియున్నవారికిని, భూమిలోనికి లోతుగా వేళ్లుబారియున్న వృక్షములకును, జీవము నొసంగుటకై, తన జన్మస్థానమును సజీవముగను, మలినరహితముగను నుంచుకొనవలయునను నొక్క సంగతియే యానదికి జ్ఞాపకముండును. మనుజుడు తన యంత్రములవల్లను, తన సంకులకృత్యములవల్లను, అందలి జలములను మలినమొనర్చినను, ఆ నది సరకుజేయదు.

కనుక, మిత్రులారా! మీరు ప్రపంచమున నలుదెసలనుండియు నిచ్చట సమావేశమై, యిటనుండి తిరిగి మీ మీ స్థలములకుబోయి, యిచ్చట విన్నసంగతుల నచ్చటజెప్పుదురు గనుక, మీకు సత్యమును గురించి గల దురభిప్రాయములనన్నిటిని, మీ సంకుచిత తీర్మానముల నన్నిటిని, మీపరిచ్ఛిన్నములనన్నిటిని, విడిచిపెట్టి, ఆకలిగొన్నవారికి శాశ్వతముగ దృప్తినొసంగు వస్తువు నీయగలరని నమ్ముచున్నాను. అట్లు జేయుటకు, మీ యల్పసూత్రములను, మీ చిక్కులను, పైయుత్తరీయమును తీసిపారవేయునట్లు పారవేసి, నిర్మలాకాశమున నొంటరిగ నొక్క నక్షత్ర మెంత నిరాడంబరముగ ప్రకాశించునో యంత నిరాడంబరముగ నుండవలెను. సౌందర్యమును,—గులాబిపూవుయొక్క—గాని,

సూర్యాస్తమయముయొక్కగాని, నిర్మలాకాశముయొక్కగాని సౌందర్యమును—చూచి, దానియందలి సుగ్రహణము మీరు చేయజాలనియెడల, నే నా సౌందర్యమును గురించి మీకు చెప్పినను ప్రయోజనము లేదు. మీ కన్నుల కడ్డముగ నొక తెరయున్నయెడల, దానిని నేను తీసివేయగలనేమో గాని, మీరు తిరిగి క్రొత్త తెరను వేసికొనగలిగినయెడల, అది మీ దౌర్భాగ్యము! మీ రితరులకు సహాయము జేయబోవుటకు ముందు సత్యమును దెలిసియుండవలెను. అట్లుగాక, కొంత యెఱుకయు, కొంత మూఢత్వము నున్నయెడల, సత్యమును తలక్రిందొనర్తురు, ఇతరులకు సహాయము చేయజాలరు. కృష్ణమూర్తి రూపమునకు మీరు భక్తిని ప్రేమను చూపుచున్నారని నే నెఱుంగుదును, కాని యదిచాలదు. మీరు సత్యము నెఱుంగవలెను. ఇచ్చట మీరుండు కొద్దిదినముల లోను, అంతర్ముఖులై, మీ యంతరంగములలో గృష్ణమూర్తిని గనుగొనవలెను. మీ కత డక్కడనే కనిపించును. నేను నా ప్రియతము నచ్చటనే గనుగొంటిని. మీ రతని నచ్చట గనుగొన్నప్పుడు, శాంతిని కనుగొందురు, శాంతిమార్గమున ప్రవేశింతురు, ఆనందమునకు, మోక్షమునకు ద్వారములను దెఱచుకొనియుందురు.

---

# IV

పూర్వకాలములలో పురుషుడు శాంతిని, ఆనందమును బొందుటకు లోకసంభ్రమములనుండియు, సంక్షోభములనుండియు విరమించి, తనలోనున్న సత్యప్రపంచములోనికి బోవుచుండెను. అన్వేషించుటకు, కనుగొనుటకు, ఆత్మానుసంధానముకొఱకు, తద్ద్వారా యెచ్చట ఆనందము, ముక్తి యున్నవో యా సామ్రాజ్యమును బ్రవేశించుటకు, పురుషుడేకాంతవాసము చేయుచుండెను. కాని యిప్పటికాల పరిస్థితులనుబట్టి, పురుషుడు ఐహికముగను, ఆముష్మికముగనుగూడ ననుభవములను బడసి యభివృద్ధి నొందవలసి యుండుటవలన, ఈ లోకములోనే యుండి, యిచ్చటనే ముక్తిని, ఆనందమును గాంచవలసియున్నది. ఐహికానుభవముల నొందుచున్నప్పుడే, ఆముష్మికబలమును, నిశ్చయమును, నిర్మించుకొని, తుద కా యనుభవములనుండి విముక్తి నొందవలసియున్నది. చిత్రకారుడు పటము వ్రాయునపుడు తాను చిత్రించురూపమునందు మమత నుంచక, తన భావములు పటమున వ్యక్తపరచుటయే ముఖ్యముగజూచి, యా పని నెరవేరినంతనే విరమించును. అట్లే మీలో నింకను అన్వేషించుచున్నవారు, ఇంకను తడుముకొనుచున్నవారు, ప్రతివానియందు నున్న యానందసామ్రాజ్యమును, సత్యసామ్రాజ్యమును ప్రవేశింపగోరువారు, ఈ రూపప్రపంచములో, ఈ వ్యక్తప్రపంచములో, ఈ యసత్ప్రపంచములోనే యుండి, యిచ్చటనే యసత్తులో బనిచేయుచు, సత్తును దెలిసికొనవలయును. మీరు సత్యము పక్షముననుండియు, సత్యములో నొక భాగమైయుండియు, అసత్తును, అనిత్యమునగు దానితోగలిసి పనిచేయవలెను. పూర్వమువలె

నిప్పుడు మీ రాత్మాన్వేషణమునకును, ఆత్మానుసంధానము కొరకును అడవులలోనికిని, మఠములలోనికిని, నిశ్శబ్దములును ఏకాంతములునైన కొండలోయలలోనికిని, పోజాలరు. అది ముక్తి కాదు. అది స్వలాభ ప్రాప్తి, స్వసుఖాన్వేషణము. ఈ దినములలో నిజముగ ముక్తినొంద గోరువారు, ఈ లోకమందుండియే పనిచేయుచు, ఈ లోకము నెక్కువ రమ్యముగను ఉత్తమముగను చేయుచు, నస్థిరవస్తువులను నిర్దుష్టములుగచేయుచు నున్నప్పుడె, ఇంకను ప్రయత్నములజేయుచు, బాధలుపడుచు, కష్టముల ననుభవించుచున్నప్పుడే, ఆ ముక్తిని, ఆ యానందమును అన్వేషించవలెను.

ఆ విధముగ జూచినయెడల ముక్తియన నిర్మాణముగాని వినాశము గాదు; ముక్తి వాస్తవముగాని యభావము గాదు. ముక్తి యనగా, సత్యములో బ్రవేశించి, సత్యములో నొకభాగమై, యందుండి బయలు దేరి, నిలకడ నీటిలోని రిక్త ప్రతిబింబములను పూజించుచున్న వారిని ముక్తులుగజేయుట, గాని, శుద్ధశూన్యములో బ్రవేశించి, యందు నశించిపోవుటగాదు. ఒకసారి నీవు ముక్తినొందినయెడల, ఒకసారి ఆ యానందము నీలోజేరి పోయినయెడల, ముక్తి యస్పష్టమును, కేవల స్వప్నమును గాక, నిర్మాణశక్తి గలదియని నీ వెరుంగగలవు. ముక్తి, మీరు మీ యెదుట జూచుచున్న యగ్నివలె, యథార్థతత్త్వముగ దెలిసి కొనదగినది. ఆ జ్వాలవలె జీవముతో తాండవమాడునది. ముక్తియనగా ప్రపంచ వినాశనమనియును, ఆత్మరహితమగు నొక శూన్యములో బ్రవేశించుట యనియును, అనుకొనువారు కొంద రున్నారు. అచ్చట భిన్నాత్మభావము లేకుండుట నిజమే, గాని యందరియందు నొక్కటి యైయున్న యాత్మయున్నది; అచ్చట ప్రపంచమంతయు, నొక్కటి యే; పూవు, తృణము, విశాలాకాశము, ప్రతిచెట్టు, ప్రతిమానవవ్యక్తి, ఆ సామ్రాజ్యములో నుండురు. అనేకులు ముక్తియనగా తమ చుట్టు

నున్న వస్తువులన్నిటియొక్క నాశనమని, ఐహికసుఖము, లలితకళ, ప్రకృతిశాస్త్రము, సౌందర్యము, వీటితో సంబంధించిన లోకమంతయు నాశనమొందుటయని, యనుకొనుచున్నారు. కనుక, మీ చుట్టునున్న యీ వస్తువులన్నిటి యెడలను సక్తత విడిచి, వానిని ఎక్కువ సుందరముగను, ఎక్కువ గంభీరముగను, నిర్దుష్టముగను చేయుటవలననే ముక్తి లభించునని తెలియుడని కోరుచున్నాను. పుష్పముయొక్క సౌరభము వాయువులో తేలిపోయి, పుష్పమును యథాప్రకారము విడిచిపెట్టునట్లే త్రోవను బోవువారికందరకును హాయిని సంతోషమునిచ్చు జీవన్ముక్తుడుగూడ నుండవలెను. కనుక, మీలో ముక్తిని ఆనందమును అపేక్షించువారు స్వప్నములను గాంచవలయును, సమాధులను ఏకాంత స్థలములను ఉంచుకొనవలయును, కాని వానికితోడు, అనిత్యవస్తుమయమైన యీ ప్రపంచములో బనిశేయుచు, లోకము అశాశ్వతమైనదైనను, దానిని సుందరముగను నుత్తమముగను నుండునట్లుచేసి, మానవకోటికి సుఖమొనగూర్చవలయును. ఐహికమును మఱచిపోవలెనన, దానిని పరిశుద్ధిగావించుకొనవలెను; తరించవలెననిన నైహికమును మఱవరాదు.

మిమ్ము బంధించు శృంఖలములను త్రెంపుకొనుటకు మీకు గల యొఱుకను, జ్ఞానమును బుద్ధిని ఉపయోగించుకొనకున్న, నవి మీకు గలిగి ప్రయోజన మేమి? మీలో చాలమంది నాకంటె నెక్కువ గ్రంథములను చదివి, యెక్కువ పాండిత్యము సంపాదించి యున్నారు; చాలమంది నాకంటె ఈ జన్మలో వయస్సున చాల పెద్దలైయున్నారు; కాని, నేను నా ముక్తిని కనుగొన్నాను గనుక, నాలోనున్న యానంద సామ్రాజ్యమును పొందినాను గనుక, మీ రా నిలయమున ప్రవేశింప గోరుదురేని, మీ సకలబంధములను తొలగించుకొనవలయునని, మిమ్ము బంధించు సకలదుఃఖములను నిర్మూలము గావించుకొనవలయునని చెప్పు

చున్నాను. కష్టములనల్లను, దుఃఖరజ్జువులవల్లను బంధితుడైన యే జీవుడును అంతర్ముఖుడుకాజాలడు. తన్నుదాను స్పష్టముగ జూచుకొన జాలడు. వాడు తనసర్వమును త్యజించినప్పుడు, తన మనస్సును హృదయమును నిగ్రహించుకొనగలడు; హృదయము కంటి ననుసరించును, మనస్సు హృదయము ననుసరించును. సత్యమును కనుగొనవలెనను దృఢాభిలాష గలిగిననేగాని, యశాంతి నిరంతరముగ నుండును. మీరు చేయు పనులవలననే, మీ కోరికలవలననే, మీ యల్పజ్ఞానమువలననే, మీ యల్పోద్దేశ్యములవలననే, మీ యల్పమోసములవలననే, మీ యల్ప గర్వములవలననే, మీరు బాధపడుచున్నారు గనుక, వానిని మీరు విడువజాలకున్నారు. మీరు మీలోనున్న యానందసామ్రాజ్యము నెన్నడును బ్రవేశింపజాలరు.

నేను కృష్ణమూర్తియయియున్న వ్యక్తి పూర్వ మొకకాలమున ముక్తి నపేక్షించెను కాని మనుజు లందరివలెనే యాతడును తన కామములు, తనజ్ఞానము, తనగర్వములు, తనమోసములు, అను చక్రములో జిక్కుకొనెను. ఆతడు తన జీవితోద్దేశమును నా సత్యమును జేరగోరెను గనుక ఆ సత్యమునకును తన యజ్ఞానమునకును మధ్యగల భేదబుద్ధిని నాశన మొనర్పజాలెను గనుక, కష్టములపాలాయెను, జననమరణ చక్రమున బంధితుడాయెను. ఇప్పు డాతడు ముక్తిజ్వాలలో, ఆనందాగ్నిలో తప్తుడైనందున, ఆతని కామములు, అతని నిర్మాణములు, ఆతని స్వీయచేష్టలు, అన్నియు నతని ప్రియతమునివై పోయినవి గనుక, నాతడు ప్రత్యేకవ్యక్తిగ నుండుటలేదు.

మీ కాముక్తిమార్గమును, ఆ యానందమార్గమును చూపి, మీరు మీ యంతరాత్మయందు బ్రవేశించి, యచట సత్యమును కనుగొనుటకై మీ హృదయములను దెఱచుట నా యుద్దేశ్యమై యున్నందున, మీరు సకలవస్తు పరిత్యాగము చేయవలయునని చెప్పుచున్నాను. మీ గ్రంథ

ములను, మిమ్ములను బంధించు శాస్త్రములను, మిమ్ములను సంకుచితులుగ జేయు తత్త్వములను, మిమ్ములను ఆవరించుపనులను, త్యజించవలెను. మీ రంతర్ముఖులగుటకై మీ మిత్రులను మీకుటుంబములను, విడిచి పెట్టవలెను. మీ రంతర్ముఖులై, యచ్చట నాకాశమందు ప్రకాశించు నక్షత్రమువలె ప్రకాశించుచున్న సత్యమునుఁ గనుగొనుటకై, మీ దేవతలను, వారికి కావలసినకర్మలను సంస్కారములను త్యజించవలెను. ఈ భారములన్నిటితోను మీరందు ప్రవేశింపబోవుదురేని, వాని బంధములలో దగుల్కొందురు. మీరు పూజించు ఆలయములలోను, మీ మూఢనమ్మకములలోను, సిద్ధాంతములలోను, చిక్కుకొందురు. వానినుండి తప్పించుకొనుటకై వానిని త్యజించవలెను. గ్రంథముల వెనుకను, తత్త్వములవెనుకను, సిద్ధాంతములవెనుకను, సూత్రముల వెనుకను, దేవతలవెనుకను, పూజాసంస్కారమువెనుకను దాగుట మీకు సులభమును, సుఖకరమునగు నని నే నెరుగుదును. కాని వానిలో చిక్కుకొనియున్నంతవరకు మీరు సంకుచితులును, బద్ధులునై, క్షణభంగురములగు సుఖదుఃఖములలో బడియుందురు. మీరు వాని నన్నింటిని విడిచి మేఘజాలములోనుండి బైటకు వచ్చినట్లు వచ్చి, యంతరంగమున ప్రవేశించి, యచట సత్యమును కనుగొందురేని, మీరా సత్యములో నొకభాగమైపోవుదురు. ఇకనటుపిమ్మట మీకాధారములుగాని, యూతకఱ్ఱలుగాని, యక్కర లేదు. కాని, బలమును, పూనికయును, గార్యోత్సాహమును, గావలయును. సులభమగుసత్యమును తెలిసికొనుటకు మీ యల్పత్వమును, మీ సంకోచమును, మీ యల్పజ్ఞానమును విడువవలెను. మీ మనస్సు సంకులమైయున్నందున సత్యమునుగూడ సంకులమొనర్చుచున్నారు. మీకు పుస్తకజ్ఞానము, పుస్తకముల ప్రమాణము ఉన్నవి గనుక, ఆ జ్ఞానమును, ఆ ప్రమాణమునే సత్యమునకుగూడ నొసంగుదురు.

కనుక, మిత్రుడా! నీవు సత్యము నన్వేషింపగోరుదువేని నిరంతరము నాట్యమాడుచుండు, నిరంతరము నిన్ను పురికొల్పుచుండు, ఎల్లపుడు నీ యుద్దేశ్యము నెరవేర్చుకొనుటకు నీకు బలమునొసంగుచుండు, జ్వాలవలె సత్యమెచ్చటనుండునో యా నిలయమును బ్రవేశింపగోరుదువేని, నీవు సకలవస్తువులను త్యజించి, నీ యంతరంగమున బ్రవేశింపవలెను. నీకు సర్వమును త్యజించుట బహుకష్టము గనుక, సత్యమును సాధించుట బహుకష్టము గనుక, నీ కూతకర్రలు గావలయును. పర్వతాగ్రమున నొంటరిగ నుండుటకంటె, నిర్జనాలయములో నుండుట సులభము. నిశ్చలసమయములయందు, శాంతిగలిగిన వేళలందు, పర్వతాగ్రమును కనుగొన గలిగెనను, అప్పుడప్పుడు నీ హృదయములో జొచ్చి యచ్చట స్వయముగ సత్యమును కనుగొనగలిగినను, ఆ సత్యమును నిశ్చలముగ నాశ్రయించి యుండుటకు గొప్పమనోనిశ్చయము కావలెను. ఏలయన, ఆనందసామ్రాజ్యమున బ్రవేశించనివారికి, అందలి స్వేచ్ఛను చవిగొనని వారికి, ఈ యసత్ప్రపంచము బహుసత్యముగ గనిపించును; కనుక, నీకు నిరర్థకములైనవాని సహాయము గావలసియుండును. కాని, యంతమున నన్నియు నొకచో జేరుకొనును; నీ వే యాశ్రయమునుండి వచ్చినను, ఆ యాశ్రయమునుండి వచ్చినను, నీవు చేరుగమ్యస్థాన మొక్కటియే. ఆ యంతమును గాంచినవారు బయలుదేరి, దానిని గాంచనివారికి, దాని నింకను దెలిసికొననివారికి, అట్టి విషయములను గురించి యింకను జ్ఞానములేనివారికి, జీవము నొసంగుట వారిధర్మము.

---

## V

ఈ సమావేశము ముగియుటకు పూర్వము మన కింకొక సాయం కాలము మాత్ర మున్నది, కనుక, మీ రిచ్చటనుండి వెళ్లుటకుముందు, నే నిన్ని దినములనుండియు చెప్పుచున్న సంగతులను మీరు బాగుగ గ్రహించవలయునని కోరుచున్నాను. సత్య మెట్లు లభించునదియు, అది యెచ్చట నుండునదియు, దానిని కనుగొనుటకు మీరే మార్గమున నడువవలసినదియు, మీ రందరు నీ సరికే తెలిసికొని యుందురు. సత్యమును కనుగొనుటలో మీరు సహజముగ సుఖము నపేక్షింతురు, కాని, సుఖమునకు బదులు ఎఱుక గలుగవలయునని మీరు కోరవలయును; ఏలయన, సుఖము గతించును; ఎఱుక శాశ్వతముగ నిలుచును. ప్రాఢత్వమునుండి, పరిపక్వతనుండి, ఆలోచననుండి, సుఖదుఃఖములనుండి కలుగునది జ్ఞానమైనట్లే, సకలానుభవముల సారమే యెఱుక. సుఖము సంతోషకరమును, మనోహరమును, సంతుష్టికరమునై యుండును, కాని, సుఖము సత్పదార్థము నొసంగదు, ఆత్మకు సమృద్ధి నొసంగదు. సుఖమువలన మనస్సు చలనహీనమై, యా మనస్సుపై పచ్చని మష్టు తేలును.

నేను నా ముక్తిని, నా యానందమును, దుఃఖముద్వారాను, కష్టములద్వారాను, అనుభవముద్వారాను, అన్నివస్తువులను త్యజించుటద్వారాను, నేను పూజించుచుండిన దేవతలను విడచిపెట్టుటద్వారాను, కనుగొంటిని. అట్లు నేను కనుగొంటిని గనుకనే మీకును దాని నొసంగ గోరుచున్నాను.

సత్యము సాధారణముగ బోధపడదు. సూర్యుని నిదానముగ జూడవలెననిన బలమైన నేత్రము కావలెను. అంత బలమైన కండ్లు గల వారు బహు కొద్దిమంది మాత్రమే యున్నారు. సూర్యుని జూడ గోరువారి కండ్లకు రంగు అద్దములు కావలెను. సత్యము కన్నులను మిరుమిట్లు గొలుపును గనుకను, సత్యము శక్తిమంతమై (దానికి విరుద్ధమగుదానిని) నాశన మొనర్చునదియైనను పునర్నిర్మాణ మొనర్చును గనుకను, అనావరణమును, అతి శుద్ధమునగు సత్యమును సామాన్యముగ జనులు చూడగోరరు. అందువలన నీవు దానికప్పుడువు, సొగసైన పేర్లుబెట్టి పిలుతువు, ఆ పేర్లలో బడి సుఖము నొందుదువు. నేనును ఆ ప్రకారము చేసియుంటిని, గనుక, నే నెరుగుదును. నేను నా కండ్లు మిరుమిట్లు గొనకుండ రంగు అద్దముల దగిలించుకొని, నన్ను నేనే మోస పుచ్చుకొంటిని. దుఃఖమునలనను, కష్టములవలనను, ఎలుకను బడయ వలయునను నాకాంక్షవలనను, నిరంతర ప్రార్థనమువలనను, ఆ యద్ద ములను, తొలగించుకొనవలసి వచ్చినది. మీరు సత్యమును కనుగొను టకుముందు మీకు స్పష్టమైన యెలుక గలుగవలెను. ఆ యెలుకతో గూడ సత్యము వచ్చును. ప్రతివానియందు నున్న, నాయందు నున్న, సత్యమును నేను కనుగొంటిని; అందరియందు నున్న, నాయందు నున్న, ముక్తిని నేను కనుగొంటిని. ఆ సత్యమును మీకు నే నీయవలె ననిన, మీ యల్పజ్ఞానములవలనను, మీ యల్పదుఃఖములవలనను, మీ యల్పసుఖములవలనను, కలిగిన దురభిమానముతో రంగు వేయబడిన మీ యద్దములను మీరు తీసివేసికొనవలెను.

మీరు సుఖమును, సత్తాను, జ్ఞానమును, విజ్ఞానమును గోరుచున్నారు. కాని, మిత్రుడా! మీ రా సత్యమును శుద్ధ అపరిచ్ఛిన్నావస్థలో చూడగలిగినప్పుడే, ఆ సత్యముతో మీ రేకీభూతులై, యందు వసించి యుండగలిగినప్పుడే, ఆ జ్ఞానము, ఆ సత్తా, ఆ విజ్ఞానమును మీకు

లభించును. కాని, యీ సత్యమును, ఆనందమును ముక్తియునగు నీ సత్యమును, తెలియగోరువారు, తాము ప్రోగుచేసికొనిన వస్తువులను, గతకాలమందు వృద్ధియై సత్యము నాచ్ఛాదించిన వస్తువులను, త్యజించవలెను. సత్యమును, మీ స్వంతయెఱుకవలన గలుగుసత్యమును, మీరు స్వాయముగ నిర్మించు సత్యమును, మీ యంతట మీరే దెలిసికొందురుగాక యని కోరుచున్నాను. ఆ యెఱుకయే నా యెఱుక, ఆ నిర్మాణమే నా నిర్మాణము. ప్రమాణము మబ్బువలె చీకటితో మూసివేయును గాని, స్పష్టపరచదు. ప్రమాణము పర్వతముఖమును కప్పివేయును, కనుక, మీరు పూజించువస్తువుకూడ కప్పివేయబడును. మీ యెఱుకలో అన్నివస్తువులును అనాచ్ఛాదితములై, స్పష్టముగను, నిర్దిష్టముగను, నుండవలెను. అప్పుడే సత్యము మీకు కనబడును.

దేనినో పోగొట్టుకొనుచున్నా మను భయము మీ మనస్సులోనుండ గూడదు. అనేకులు సహజముగ మిథ్యాభిప్రాయమువలన, లేక సత్యమును తెలిసికొనఁజాలమివలన, ప్రియతముని మహిమను జూడజాలమని భయపడుదురు. కాని, మిత్రుడా! నీ వా మహిమను జూడగోరినయెడల, నీవు ప్రియతముని ముఖముఁజూడ గోరినయెడల, నీ హృదయము ప్రసన్నముగను, నీ మనస్సు ప్రశాంతముగను ఉండవలెను; అప్పుడు నీకు విచక్షణశక్తి, నిర్ధారించుకొనుశక్తి, అల్పములును అనిత్యములు నగు వస్తువులను త్యజించుశక్తి కలుగును.

కనుక, నీ వెఱుకకై యాకాంక్షించవలెనుగాని, పోయినకొఱ కాకాంక్షించవలదని చెప్పుచున్నాను. ఎఱుకగలిగినంతనే విమర్శనశక్తియు, సహనమును, అనురాగమును గలుగును. అవిలేకుండ సత్యము నన్వేషించువాడు, తాను కల్పించుకొనిన శృంఖలములతో తానే బంధితుడై, దురవస్థపాలగును. కనుక, మీ యెఱుకను సంపాదింపుడు, కాని, నిర్దిష్టములగు నమ్మకములను సిద్ధాంతములను ప్రమాణములను మూఢ

నమ్మకములను మాత్రము సంపాదించుకొననలదని కోరుచున్నాను. ఎటుకగలిగినపుడు మీరితరులకు సహాయము చేయఁగలరు; అప్పుడు మీరు ప్రియతమునకు వాస్తవముగ శిష్యులు కాగలుగుదురు; అప్పుడు మీరు ప్రియతముని మీలో నుంచుకొనగలుగుదురు.

అందరివలెనే కృష్ణమూర్తియును పూర్వకాలమున నన్వేషించెను, ఇతరుల ననుసరించెను, పూజించెను; కాని, కాలము గడిచినకొలదియు, కష్టము లెక్కువైన కొలదియు, ప్రతిమ కాధారమైనట్టియు, సూర్యాస్తమయమునకును, విగ్రహమునకును, తత్త్వములన్నిటికిని, మతములన్నిటికిని, తెగలన్నిటికిని, సంఘములన్నిటికిని, ఆధారముగ నున్న సత్యమును కనుగొననలెనని యాతడు కోరెను. ఆ సత్యమును తెలిసికొనుటకై, తన్ను బంధించుచున్న యూలయముల నన్నింటిని, తమను బూజించవలెనని నిర్బంధించు దేవతలనందరును, క్రమ క్రమముగ గడచి రాగలిగినంతవరకును, ఆతడు అసత్యము అన్నతము అనునొక మేకున వ్రేలాడుచుండెను. వాని నన్నిటిని గడచుటలో అన్నిమతములును, అన్ని యనురాగములును పరిసమాప్తి నొందుచోటును, పూజయంతయు నంతము నొందు జోటును, కోరికయంతయు నశించుచోటును, భిన్నాత్మనశించి తద్వారా పవిత్రతనొందు చోటును, ఆతడు చేరగలిగెను. ఈ యంతరువుల నన్నిటిని నేను గడిచితిని, గనుక, నేను నాయనుభవముల ప్రమాణమును బట్టి, నాజ్ఞానముయొక్క ప్రమాణమును బట్టి మీకు చెప్పగలుగుచున్నాను; మీ కా జ్ఞానమును, అనుభవమును ఈయ గోరుచున్నాను.

కొండదారులను మార్గదర్శి యెరుగును. ఆదారుల వెంటబోవుట అపాయకరమైనను, ఆ త్రోవలయందు గొప్ప యాటంకము లున్నను, విశేషముగ గోతులున్నను, నీవును నీ మార్గదర్శివలె నుండవలెనని కోరినయెడల, నాదారుల నెరింగిన మార్గదర్శి ననుసరించి పోవలెను.

అయితే, గ్రుడ్డిగను, మూఢనమ్మకముతోను, గ్రుడ్డినమ్మకమునను, అనుసరింపక సత్యమును కనుగొనవలయునని నీకు గలిగిన కోరికవలనను, నీ స్వంత దుఃఖానుభవమువలనను, నీకు శృంఖలములై, కష్టము లనెడి త్రాళ్లతో నిన్ను బంధించుచున్న వాని నన్నిటిని త్యజించవలెనని నీకు కలిగిన కోరికవలనను, అనుసరించవలెను. అట్లు మీరు నన్ననుసరించి, యీ సత్యమున్నట్టి, ప్రియతముడు వసించుచున్నట్టి, మీ హృదయముల లోనికి బోవ గోరుదురేని, మీమనస్సు ఎఱుకగలిగి, సుశిక్షితమై నిష్పక్షపాతమైనదియు, బంధహీనమైనదియు, మాహాత్మ్యమును జూచుటకే ఆవరణములును లేనిదియునై యుండవలెను. పక్షపాతము మరుగుపఱచునుగాని స్పష్టపరచదు; అది సూర్యుని మరుగుపఱచు మబ్బువంటిది. అనేకులు మబ్బుచాటున నుండగోరుదురుగాని, తమకును సుప్రకాశమగు సూర్యబింబమునకును మధ్య నడ్డమేమియు లేకుండునట్లు మబ్బున కెదురుగ నుండగోరరు. మీ మనస్సు పక్షపాతరహితమును, సంకుచిత విహీనమునై, యెఱుక గలిగియున్నయెడల సత్యము లభించును. సత్యమునకు మీ హృదయమును మీ యెఱుకయును నిలయము; ఆ నిలయమునకు మిమ్ము సత్య మాహ్వానము చేయును.

మరియును, మీ హృదయము శాంతమై యుండవలెను; అనురాగపూరితమును, అసంగమును, స్వార్థరహితమునై, యుండవలెను. ప్రేమించుట యత్యావశ్యకము; ఏలయన, ప్రేమవలన నీవు పెరుగుదువు, వికసింతువు, ఆకాశమున స్వేచ్ఛగా విహరించుపక్షివలె సదా సంతోషముతో నుందువు. కనుక, హృదయము అనురాగపూరితమయ్యును, అసంగమును, స్వార్థరహితమునై యుండవలెను; తన యనురాగమొక్క వ్యక్తియందుగాని, యొక సంఘమునందుగాని మాత్రముగాక యందరి యందును ప్రసరింపఁజేయగలిగి యుండవలెను.

ఇంతియగాక, మీ శరీరమెలుకతో సంపూర్ణ సౌష్ఠవమునొందినదై యుండవలెను. శరీరము పరిశుభ్రముగను, సలక్షణముగను నుండనియెడల ననారోగ్యము గలుగును. మీ మనస్సు, హృదయము, శరీరము, పరస్పర సహకారులై, యొకదాని నొకటి వృద్ధిపరచుకొనుచు, ఒకదాని నొకటి ప్రోత్సాహపరచుకొనుచు నున్నయెడల, మిమ్ము సత్యమునుండి వేరుచేయు తెర నశించిపోవును. అప్పుడు చలనము లేకుండుటవలన గలుగు కుళ్లుసుఖముగాక, మీరు వాంఛించుచున్న యెలుకవలన గలుగు సుఖము మీకు గలుగును. అడవులలో వాయుప్రచారము విశేషముగ లేనిచోట్లను, చలనములేని చోట్లను, పక్షులు వాలని చోట్లను, నుండు తటాకములలో పచ్చని పాచి పెరిగియుండును. ఆ తటాకముల లోని నీరు ద్రావుట కే జంతువులును రావు. మనుష్యు లెవ్వరును వానిని జూచి యానందించరు. ఆ నీటిలో నాకాశముయొక్క గాని పక్షులయొక్కగాని ప్రతిబింబములు కనిపించవు. హాయిని గోరి సుఖించు మనస్సు, రాగములు, శరీరము, అట్లే యుండును. కాని మీరు యెలుకను బడయగోరిన తక్షణమే, మీయందా సత్యమును బడయగోరిన తక్షణమే, నృత్యముచేయు సముద్రోదకమువలె నగుదురు; మీకు శాంతియు, ప్రసన్నతయు గలిగినను, మీరు సముద్రమువైపు గంతు లిడుచు ప్రవహించు నదీజలములవలె నుందురు.

కనుక, నాయందున్న సత్యము ననుసరించువారు, తమ యెలుక యందును, తమ యనుభవమునందును, తమ దుఃఖములయందును, సుఖములయందును, జ్ఞానమును గనుగొనవలెను. పసిబిడ్డ కొక చక్కని చిత్తరువునిచ్చిన నేమి లాభము? దాని సొగసు నా బిడ్డ గ్రహించ జాలదు. కాని యా చిత్తరువునే యొక చిత్రలేఖకునకు గాని, చిత్రలేఖనము నామోదింపదగిన జ్ఞానమున్న వానికి గాని, యిచ్చిన యెడల, వాడు దానియందలి గుణగ్రహణము జేయగలడు; వాడు దానికి కేవల

ప్రతి లేఖనముచేయక, తనయందు, తన కనుకూలమగురీతిని, దానిని తిరిగి నిర్మించుకొనును. మీ రితరుల ననుకరించవలెనని కోరుదురు, కనుకనే, దుఃఖము గలుగును. మీరు ప్రమాణములను కోరుదురు, కనుకనే, కష్టములు గలుగును; కాని, మీరెఱుకను బడయగోరినయెడల, ఇతరులకు సహాయులు కాగోరినయెడల, మీ యెఱుక ననుసరించి నిర్మించగోరినయెడల, మీకు కష్టములు కలుగవు. శాంతిని బడయుదురు. మీ యంతరంగమున సదా ప్రియతమునితో గూడియుండి యానందమును గెలకొల్పుదురు. మిత్రమా! మనమందరము కలిసియున్న యీ స్వల్పకాలములో, జ్ఞానముగలవారు—గుప్తవిషయ జ్ఞానము కాదు—కొంద రెఱుకను బడసియుందురు; వారియందా యెఱుకతో నితరులకు సహాయ మొనర్చు బాధ్యత నిలచియుండును. నీయందు సత్యముయొక్క మహిమ నిలచియున్న యెడల, అగ్నిలో కట్టెలను వేసిన నెట్లు ప్రజ్వలించునో యట్లు, ఆ సత్యమును పూర్తిగా వికసింపజేసికొనగలవు; లేనియెడల, ఆ జ్వాల నార్పివేసి, తిరిగి యది నీకు సుఖమును వేడిని నిచ్చునట్లు, నీ మనస్సునకు, దుఃఖించుచున్న నీ హృదయమునకు తత్త్వసారము నిచ్చునట్లు, ప్రజ్వలితమగుటకై యొక యుగము, అనేక శతాబ్దములు, వేచియుండవలసివచ్చును.

---

## VI

పూర్వ మొకప్పు డొక పర్వత ముండెను. దాని శిఖరము మేఘములలో దాగియుండెను. ఆ పర్వతముచుట్టును విశాలమైన బయళ్లును, లోయలపై లోయలు నుండెను. ప్రపంచ మన్ని దిక్కులనుండియును జను లాపర్వతశిఖరమును కనుగొనుట కచ్చటఁ జేరిరి. ఆ పర్వతశిఖరమునందున్న సత్యమును కనుగొనుట కనేక జనాంగములకు చెందిన జనులు, అనేకరకముల జనులు, అచ్చటకు వచ్చిరి. వారిలో కొందరా కొండచరియలయందలి పత్రములను పుష్పములను క్రిమికీటకాదులను పరీక్షించుటకు వచ్చిరి; కొందరా పర్వతమునందలి శిలావిశేషములను, దానియెత్తుపొడవులను, దాని నీడయొక్క వైశాల్యమును, శాస్త్రోక్తముగ పరీక్షించుటకు వచ్చిరి. ఆ పర్వతమును పూజించుటకును, దాని మహిమను జూచి సంతసించుటకును, తాము చూచిన సంగతులను జ్ఞాపకముంచుకొని తమ యిండ్లకుపోయి వాని నచట స్మరించుకొనుచుండుటకును, జనులు వచ్చియుండిరి. మరికొందరా పర్వతరూపమును చిత్రవర్ణములతో చిత్రించుటకు వచ్చిరి, కొందరు దాని ఛాయాపటము లెత్తుటకు వచ్చిరి, కొంద రందునుండి మంటిపెల్లలను రాళ్లను తీసికొని పోవుటకు వచ్చిరి, ఇంకనుకొంద రా పర్వతముచుట్టును ప్రదక్షిణాదికము లొనర్చుటకు వచ్చిరి, కొందరా పర్వతమునుగుఱించిన సత్యము నితరులకు జెప్పవచ్చునని వచ్చిరి; కొందరు వచ్చి యచట మాట్లాడి యా మాటల ప్రతిధ్వనినే వినిరి—వారి నవ్వులాట లా పర్వతముపైబడి తిరిగి ప్రతిధ్వనించి వారి చెవులయందే బడెను.

మరికొందరు జ్ఞానమును బడయగోరి, తమ కష్టముల నన్నిటిని తీర్చు మార్గ మా పర్వతమే కనపరచవలయునని కోరివచ్చిరి. కాని, యా పర్వత శిఖర మంతరిక్షమున మేఘములచాటున నుండెను; ఆ శిఖరము నరకు నెక్కి యచ్చటనుండి జనులనందరను, వారి వారి స్వభావముల నన్నిటిని, చుట్టునున్న లోయలను బయళ్లను అన్నిటిని, పూర్తిగ జూడగలిగెనవారు బహు కొద్దిమందిమాత్రమే యుండిరి. సత్యము సైతము అట్టిదియే.

వివిధములగు నలువది దేశములనుండి యిచ్చట సమావేశమైయున్న మీరు సత్యమును బూజించుటకు, సత్యమును కనుగొనుటకు, వచ్చి యున్నారు. కాని, నేను మీకు దెలియజేయునదేమో తెలిసికొనుటకు, బోధపరచుకొనుటకును, మీమీ యెఱుకలను, మీమీ సంశయములను, మీమీ ప్రోత్సాహములను, మీమీ జ్ఞానమును, మీతో దీసికొనివచ్చితిరి. నన్నును, సత్యమును జూచుటకు మీరిచ్చటికివచ్చినారు. కాని మీరు, కొంతయెఱుకతోను, కొంత పక్షపాతబుద్ధితోను, కొంతవరకు విమర్శిం చుచు, కొంతవరకు సత్యమును తలక్రిందుజేయుచు, వచ్చినారు. పర్వ తాగ్రమును జేరబోవువాడు, స్వచ్ఛమైన సత్యమును పూర్తిగా నెఱుగ బోవువాడు, హృదయబలము గలవాడై యుండవలెను. ఆ దర్శనమును జూచుటకు, ఆ సత్యముయొక్క మహిమను గాంచుటకు బలమైనకండ్లు కావలెను. ఒక ప్రతిమను, ఆ పర్వతమునందలి శిలలను, పూజించు వారు, ఆ సత్యమునందొక భాగమును మాత్రము తెలిసికొని, తమ మిడి మిడి జ్ఞానమునకును, స్వల్పయెఱుకకును, అల్పబుద్ధికిని తామే మెచ్చు కొనుచు, నిండ్లకు బోవుదురు. కాని, సత్యమును పరిపూర్ణస్వరూప మున, శుద్ధసత్యమును గంభీరస్వరూపమున, సరళ స్వరూపమున, తెలిసి కొని మీయందు నిలుపుకొనినగాని, మీరా సత్యము గాజాలరు. భాగ మెన్నడును పూర్ణసత్యము గాజాలదు. సత్యములో నొకభాగమును జూచి నంతమాత్రమున పూర్ణమైన సత్యమును సమగ్రముగ నెఱుగజాలరు.

నే ననేక శతాబ్దములనుండి, అనేక జన్మములలో, దేనిని సాధించి నాహృదయమున నెలకొల్ప నేర్చుకొనియుంటినో, యా సంపూర్ణ సత్యమునంతను, మీకొసంగ గోరుచున్నాను. మీరు మీ భిన్నస్వభావములతోను, వివిధములైన తెలివి తేటలతోను, భిన్నజ్ఞానములతోను, వివిధదేశములనుండి వచ్చియున్నారు. కాని, మీరీ సత్యమును పూర్ణముగ గ్రహించుటకు పూర్వము, ఈ సత్యమును, అనాచ్ఛాదితమును సరళమునగు రూపమున, దెలిసికొనుటకు పూర్వము, చిత్తశుద్ధియు, హృదయశాంతియు గావలెను. మీ దుఃఖములనెడు నస్థిరములగు నీడల నన్నిటిని, మీ యిక్కట్లనెడు క్షణభంగురములగు నీడల నన్నిటిని, మీ సుఖములనెడు నస్థిరములగు ఛాయలనన్నిటిని, తత్క్షణమే విముక్తి జేసికొనుటకొక సాధనము కావలెనని మీరందరును కోరుచున్నారు. ఆ సాధనము బైటనెన్నడు నుండక, మీ యెఱుకనుండియే, మీ జ్ఞానమునుండియే, మీలో నిలచియున్న బుద్ధినుండియే, లభించును, కనుక, మీ కాశాభంగమగుచుండును. మీరు సత్యమును సంపూర్ణముగ నెఱుగజాలరు గనుక సంభ్రమము, వైకల్యము, శంక, సంశయము, కలుగుచున్నవి. ఒక్కక్షణమాత్రము సత్యమును దర్శించినంతమాత్రముననే మీ దుఃఖములు, మీపీడలు, మీ రనేకయుగములనుండి మూటకట్టుకొని వచ్చుచున్నవన్నియు, నొక్కసారి తుడుచుకొనిపోవలెనని కోరుదురు. ఒకనది యొక్క మూలమే దోషపూరితమైయున్న యెడల, నిక నానది యెట్లు శుచిగను, శుభ్రముగను, నిర్మలముగను ఉండును? కనుక మీరా మూలమునకే బోయి, యిదివరకు మీరు గడచిన యవస్థలనన్నిటిని తిరిగి గడచుటకు బ్రారంభించవలెను. ఆ యవస్థలనన్నిటిని మీ మనస్సులలో తిరిగి మననముజేసికొని, వానినుండి తెలిసికొనవలసిన యర్థమును తిరిగి తెలిసికొనినయెడల, పర్వతాగ్రమున నొంటరిగను స్థిరముగను పెరుగు సాలవృక్షమువలె తిన్నగా బెరుగుదురు. కాని, మానవబుద్ధి

యనెడి మేఘమునకు పైనున్న యీ పర్వతాగ్రమును మీ రెక్కవలె ననిన, అందుకు పరిపూర్ణమైన త్యాగము కావలెను, మీరు గొప్ప దుఃఖములను, గొప్ప సుఖములను, గొప్ప యుద్రేకములను, అనుభవించ వలెను. అందరివలెనే, మీరును, ఆ మూలమునొద్దనే ప్రారంభించవలెను. అక్కడనే జ్ఞానము, బుద్ధి, మనోగతమును హృద్గతమునైన యెఱుకయు, నుండును. మీకు శుభ్రమైన మనస్సును శుద్ధమైనహృదయమును, లేని యెడల, ఎఱుకగల మనస్సును, సానుభూతియు ననురాగమును గల హృదయమును, లేనియెడల, నికనే ప్రమాణమున్నను, ఏ పుస్తక జ్ఞాన మున్నను, ఏ మానుషజ్ఞాన మున్నను, అవియన్నియు నాకు రాలుకాల ములో నెండి రాలిపోవు ఆకులవలె నెండి రాలిపోవును.

కనుక, నున్నతోన్నతమగు నెఱుకను, సంపూర్ణమును, మహత్తర మును, సరళమునగు సత్యమును, బొందగోరువారు తమ మనస్సులను, హృదయములను, శుభ్రముగను, బలవంతముగను, నిర్దుష్టముగను ఉంచు కొనవలెను. అట్లుంచుకొనవలెననిన, మిమ్ము మీరు కనిపెట్టిచూచుచు, పరీక్షించుకొనుచు, విమర్శించుకొనుచు, మీరు నిరంతరము మారుచుండ వలెను. పరిపూర్ణమును, మహత్తరమునగు రూపమున సత్యమును దెలిసి కొనుటకుముందు నీవు బలవంతుడవును, జ్ఞానయుతమగు ననుభవము గలవాడవునై యుండవలెను. సత్యముండు పర్వతశిఖరములకు నీవు బోఁగోరుదువేని, నీ సమస్త చర్యలను, నీ సమస్త సంకల్పములను, సమస్త అనురాగములను, కనిపెట్టి చూచుచుండవలెను; అవి శుచిగను, శుభ్రముగను నుండనియెడల, నవి యీ సత్యమునకుఁ దగినంతబలముగ నుండనియెడల నవి నిన్ను బంధించును. బలహీనుడు పర్వత శిఖరముపై కెక్కఁబోయిన నెవ్వడు తోడ్పడగలడు? వాడు స్వసహాయమునేగాని, తన యంతరంగమునుండి బలమును దెచ్చుకొనవలెను. తమ దుఃఖములను, అస్థిరములను తమ యనురాగములను, కామములను, కష్టములను, నశింప

జేయు సత్యము నెవ్వరు కాంక్షగోరుదురో, వారి హృదయము బలము గలదియు, స్వచ్ఛమైనదియు, శుభ్రమైనదియునై యుండవలెను. నీకు బుద్ధియును, అనుభవమును, మార్గమును జూపు అంతరంగ విజ్ఞానమును, ఉండవలెను. అవి లేనియెడల నీవు సత్యమును దెలిసికొనుటకు ననేక దినములు గడపవలెను, అనేక వత్సరములు గతింపవలెను. అవి లభించుటకై, నీయొక్క ప్రతికార్యమును, నీలో బుట్టు ప్రతితలంపును, సందేహించి యాక్షేపింపవలెను. నీలో నిలచియున్న యా సత్యమును బొందువరకు, నీ సత్యమును గురించి నీకు దృఢనిశ్చయము గలుగునంత వరకు, నీ కార్యోద్దేశ్యములను గురించి, నీ గమ్యస్థానమును గురించి, నీ మనోనిశ్చయమును గురించి, నీకు గలుగుమహా సందేహమునుండి పుట్టిన దృఢనిశ్చయము కలుగువరకు, సంతుష్టిపడి యూరకొనవలదు. ఇట్టి సందేహమునుండి పుట్టు నిశ్చయము గొప్పదియు, బలమైనదియు, సార్థకమైనదియు నగు.

మరియును, ప్రమాణమును గురించియు, హెచ్చరికతో నుండుడు. ప్రమాణమువలన నొక్క క్షణము సుఖము కలుగవచ్చును, కాని యది సత్యముకాదు, శాశ్వతముకాదు, నిత్యముకాదు. అది నిర్మలాకాశమున బారు మేఘమువలె బోయి, నిన్ను మార్తాండుని తీవ్రమగు వేడిమికి తపించునట్లు ఆచ్ఛాదనములేక విడుచును. కనుక మీ స్వంతమగు జ్ఞానము, మీరు నిర్మించిన జ్ఞానము, మీ యనుభవజనితమైన జ్ఞానము, మీకు కావలసినయెడల, మీ రంతర్ముఖులుగావలెను. మీరు ప్రోగుజేసికొనిన వాని నన్నిటిని, మీలోపలి మాలిన్యములనన్నింటిని, తుడిచివేసికొనవలెను; ఉదయమున సూర్యుడుదయించుచు క్రమక్రమముగ తన వెచ్చని కిరణములతో, పొగమంచును దొలగించునట్లు మీయందు పర్వతము నెక్కుటకు తగిన బలమును, మనోనిశ్చయమును, కార్యోద్దేశ్యమును మెల్ల మెల్లగ బుట్టును. ఇందే వాస్తవమగు సుఖమున్నది.

నీ స్వానుభవమునలనను, నీ స్వంతజ్ఞానమువలనను సంపాదించినది శాశ్వతమును, నిశ్చయమునై యుండును. నీ చేతులతో నీవు నిర్మించిన దానిని, నీ దుఃఖములతోను నీ కష్టములతోను నీవు నిర్మించినదానిని, ఇతరు లెవ్వరునుగూడ త్రోసివేయజాలరు. నీవు స్వయముగ నిర్మించుట వలన నుదారజీవితవాంఛ పుట్టును. ఉదారజీవితవాంఛ నీకు, నీవే తప్ప నితరులెవరీయగలరు? ఒకడు శాంతిమార్గమున, ముక్తిమార్గమున, ఆనందమార్గమున, నడచునట్లు ప్రోత్సహించుటకు వాని హృదయ మునకేగాని మరిదేనికి సాధ్యమగును? ఇతరులు నీకు ప్రోత్సాహమై నను గలుగజేయవచ్చును, నిరుత్సాహమైనను గలుగజేయవచ్చును; కాని, మార్గమందు నడుచుశక్తి నీకుమాత్రమేయున్నది, మనోనిశ్చ యము చేయుటయు నీపని యేయై యున్నది, సత్యజ్ఞానము నీయందే యున్నది.

నీవాసత్యమును బొందగోరినయెడల, ఆ సత్యజ్ఞానమందు నీవు పరి పూర్ణుడవు కాగోరినయెడల, నిరుపయోగములైన వాటినన్నిటిని విడిచి పెట్టి, పరాజ్ఞానము సంపాదించుటకొరకు నీ యల్పజ్ఞానమును విడిచి పెట్టి, పరాబుద్ధిని సంపాదించుటకొరకు నీ యల్పబుద్ధిని విడిచిపెట్టి, యీ విధమున త్యాగమును సాధించవలెను. తుదకు, ఎచ్చట సం శయము లేశమైన నుండదో, ఎచ్చట దురభిప్రాయముండదో, ఎచ్చట విమర్శించుటయందు వైపరీత్యముండదో, ఎచ్చట నసత్యములగు తలం పులును రాగములు నుండవో, ఎచ్చట క్షణభంగురములగు ననురాగము లుండవో, యానిలయమును జేరినపుడు, నీవు నిశ్చయముగ సత్యమును బొందినవాడవై, నిజముగ, నావలె, ప్రియతముడవేయగుదువు.

దూరదేశములనుండి పర్వతమును పూజింప వచ్చినవారు దానిని పూజింతురు, దానిఛాయాపటముల నెత్తుదురు, తామచ్చట ప్రోగుజేసిన రాళ్లను మట్టిని గొని పోదురు, ఆ ప్రాంతములనున్న దేవభూతగణ

ములను పరీక్షింతురు; కాని శిఖరముపై కెక్కిన వారాపర్వతములోఁ దాదాత్మ్యముఁ జెందుదురు; ఆ యగ్రమున కెక్కిన వా రితరులకు సహాయమొనర్చుట, దానముచేయుట, ముక్తి నొసంగుట, వలనగలుగు సంతోషము నెరుంగుదురు.

కనుక, మిత్రులారా! పర్వతమును బూజించుటకై పలుజనాంగములనుండి యిచ్చట సమావేశమైన మీరు తిరిగి మీ మీ యిండ్లకేమి కొనిపోదురో! జాగ్రత.! సత్యమునం దొక భాగమునే గొనిపోదురో, లేక, సత్యమునంతను పూర్తిగ గొనిపోదురో! సత్యమున నొక భాగమును మాత్రమే కొనిపోవుదురేని, పిమ్మట పర్వతాగ్రమును జేరుటకు, ప్రియతముడేయగుటకు, కేవల సత్యస్వరూపులగుటకు, మీ యందు అతితీవ్రమగు కోరిక పుట్టవలెను. నావలెనే మీరా ప్రియతముడై నపుడు, నిత్యములగు ప్రాణజలముల నొసంగగలరు, దప్పిగొనిన వారిని తృప్తి పరచగలరు, కష్టములలో నున్నవారికి ఉపశమనము నీయగలరు, లోకరక్షకులు కాగలరు. మీ రందరును చిన్నదీపపు వెలుతురున నడచుచున్నారు. అయినను మీరందరును నా హృదయమందు నిలచి యున్నారు గనుక, నేను మీకు సూర్యునివెలుతురును కనపరచ గలను.

నేటితో యీ సమావేశము ముగియును. మీరందరును సత్యమున నొక భాగమును గైకొని మీ మీ దేశములకు బోవుచున్నారు, మీ రెరిగినంతకంటె నెక్కువ బరువును మీతో గొనిపోవుచున్నారు; మీ జీవితములను, ఇతరుల జీవితములనుగూడ, సమృద్ధిగ జేయుట కేగుచున్నారు. మీరు మీహృదయములో నొక సూర్యుని, మీమనస్సులో సంతోషమును, ఉంచుకొని, శాశ్వతములగు వస్తువులను, ఇతరులకు శాశ్వతసుఖము నొసంగు వస్తువులను నిర్మించవలెను. ముక్తిబొందిన వానికి, వియోగమువలన దుఃఖము కలుగదు. మీరందరు నాలో నున్నారు గనుక నాకు వియోగముండదు, కాని, నేను మీలో లేను

గనుక మీకు వియోగమును, దానివలన దుఃఖమును గలుగును. ఎవరు సత్యమును పూర్తిగ దెలిసికొనకుండుటచేత సత్యమును సాధించలేరో, సత్యములో భాగముగ జేరిపోలేరో, వారికి వియోగముండును, గాని, మీరా సత్యమును మీ హృదయములలో వహించియున్నయెడల, సకలాన్వేషణమునకును పరమావధినగు నన్ను మీ హృదయములలో నిలుపుకొని యున్నయెడల, మీకుగూడ వియోగముండదు. పర్వతాగ్రమును బొందుటకై ప్రయత్నము చేయునపుడు, పాటుపడునపుడు, కలుగు కష్టసుఖములు రెండింటియందును ఏకీభావ ముండును. కనుక, మిత్రుడా! నీ వెక్కడికేగినను, నీయందా సత్య మున్నయెడల, నీ వొంటరిగ నుండవు, ఖిన్నుడవై యుండవు, నీవు వెలుపలనుండి సుఖమును కోరనక్కరలేదు. ఈయొక్క సత్యము దక్క మరియే సత్యమును నీ కక్కరలేదు.

---



Printed by A. K. Sitarama Shastri, at the Vasanta Press,
Adyar, Madras